# ఇండియాలో విప్లవం



కె. రాధాకృష్ణమూర్తి బి. ఏ.

రాడికల్ పబ్లికేషన్సు, తెనాలి.

వెల రూపాయి

# పీఠిక

ఒకరోజు సాయంకాలం రాధాకృష్ణమూర్తి తన పుస్తకం తీసుకొచ్చి ఇచ్చి పరిచయం రాసిపెట్టండి అని అడిగాడు. సరే అన్నాను. ఆరాత్రే పుస్తకం చదివాను.

ఏవిషయాన్ని కూర్చి అయినాసరే రాధాకృష్ణమూర్తి చక్కగా చెప్పగలడు. భావాన్ని వెలిబుచ్చటానికి భాషని సవ్యంగా వాడుకో గలడు. చెప్పవలసింది లేందే కలంపట్టుకోడు. చెప్ప దలచిందేమో సూటిగా చెప్తాడు.

సాధారణంగా మన రచయితలు, చెప్పవలసింది లేకపోవటం వల్లో, తాము చెప్పదలచింది లోకానికి తెలపకుండా వుంటం మంచిదనో — మొత్తానికి ఏకారణం వల్లయితేనేం తమ బండారం బయటపడకుండా చేసుకోవటానిగ్గాను పులుముడూ, తోముడూతో పుస్తకాలనునింపుతున్నారు. భావదారిద్ర్యంతో పాటు, భాషాస్వరూపంకూడ తెలియనివాళ్ళు ఎక్కువ అవటం వల్ల పెద్దపెద్ద సమాసాలూ, పెద్దపెద్ద మాటలూ గుప్పి పుస్తకాలను గజిబిజి చేస్తున్నారు. పైగా ఇదేభాష అనుకుంటున్నారు. ఉదాహరణకు చెబుతాను.

భాషాప్రయోజనం తెలిసినవాడూ, ఆప్రయోజనాన్ని సాధించటానికి భాషను లొంగతీసుకొన్నవాడూ ఇలారాశాడు— "నాకు ఊహ వచ్చినప్పటినుంచీ నేనింతే!" ఈభావాన్నే తెలుగు మర్యాదలు తెలియనివాడూ, భాషాస్వరూపాన్ని

అర్థం చేసుకోలేనివాడూ, మరేం చేస్తాడో చూడండి. ఇతనికి 'ఊహ' అనేమాట రాదు. అందుకని యీ భావం రాయటానికి ఇలారాస్తాడు- "వయస్సున నేను చిన్ననై నప్పుడు, అనగా నేను జిలిబిలి పలుకులు పలుకునప్పుడు..." అంటాడు. తెలుగు సంస్కారం రాక, తెలుగుభాషను అవగాహన చేసుకోలేక తాను ఇన్నితంటాలుపడి, చదివేవాళ్లని భీతిల్లచేస్తాడు. పైగా భావంటే ఇలాగే ఉండాలని చెబుతాడు. అంతేగాని సరైన మాట దొరక్కపోవటంవల్ల ఇన్ని వాక్యాలూ, ఇంత పద జాలం గుప్పవలసి వచ్చిందని ఆలోచించుకోడు.

రాధాక్రిష్ణమూర్తికి ఈజబ్బు లేదు. తోలుకొడుతూ, 'ఆడవె ఆడవె అన్నులమిన్నా' అని పాడుతూ భాషతో దొమ్మరి మొగ్గలు వేయించడు. గారడీవాడికి మల్లే భాషఅనే బుట్టలో భావంఅనే ఆడదాన్ని పెట్టినట్టు పెట్టి, కనుకట్టు కట్టి ఖాళీ బుట్టను బోర్లించి చూపి, ప్రేక్షకలోకాన్ని 'తాళీబజావ్ లు' కోరడు.

రాధాక్రిష్ణమూర్తి సంగతినాకు ఇదివరకే తెలుసు. ఈ పుస్తకంకూడా నా పాతఅభిప్రాయాన్ని బలపరిచిందే కాని, తబ్బిబ్బు చెయ్యలేదు. అత డిచ్చిన పుస్తకం చదవటం పూర్తి చేసి, అందులో అతడు వెలిబుచ్చిన భావాలను సమన్వయం చేసుకుంటూ పడుకున్నాను. ఒక్కసారి మన రాజకీయాలూ, అంతర్జాతీయ రాజకీయాలూ బొమ్మలు బొమ్మలుగా కళ్ళ ముందు ఆడినై. మన దేశంలోని రాజకీయ పార్టీలన్నీ ఒక దాని తర్వాత మరొకటి తెరమీాద కెక్కి తైతక్క లాడినై.

అలాగే ఆలోచించుకుంటూ వొత్తిగిలాను, కన్ను మూశాను...

అదొక పెద్ద మీటింగు. జనం కిటకిట లాడతా వుంది. ప్రేక్షక వర్గంలో నేనూ కూర్చున్నాను. ఎందుకో తెలియదు గాని భయం భయంగా ఒక మూల నక్కి కూర్చున్నాను. మిగిలిన వాళ్ళంతా అంత ఉత్సాహంగా వున్నప్పుడు, నేనింత భయపట్టానికి కారణం ఏమిటో నాకు తెలవటం లేదు.

అకస్మాత్తుగా, సినిమాలో బొమ్మలాగా, పార్కులో పైకి లేచే జలధారలాగా రాధాక్రిష్ణమూర్తి వేదిక ఎక్కాడు. వేదిక చుట్టూ కొంకి కర్రలవారు, తలపాగాలవారు సుఖాసీనులై వున్నారు. రాధాక్రిష్ణమూర్తి నెమ్మదిగా చిన్న చిన్న వాక్యాలతో మాట్లాట్టం మొదలు పెట్టాడు.

"కామ్రేడ్స్,

ఇవ్వాళ మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? నా ఉపన్యాసం విని ఏమన్నా నేర్చుకోవాలనా? లేక హరికథ వింటానికి, తోలు బొమ్మలు చూట్టానికి వచ్చినట్లు కాలక్షేపానికి వచ్చారా?

"వింటానికే వొచ్చాం"... "వింటానికే వొచ్చాం" అని సభికుల్లోనుంచి కేకలు. ఆ కేకలు సంతోషంతో వేసినవే అయినప్పటికీ నావొళ్ళు జలదరించింది.

" అయితే శ్రద్ధగా వినండి, " అని ప్రారంభించాడు రాధాక్రిష్ణమూర్తి. "మనస్సు దగ్గరపెట్టుకొని వినండి. మన దేశం గుడ్డుకుడిసి పోతావుంది. మీకేమో ఈసంగతి తెలవటం లేదు. ఆర్యులకూ, రాజపుత్రులకూ, మహమ్మదీయులకూ, దేశాన్ని అప్పగించిన జాతే ఇప్పుడు మళ్ళీ జపానికి నైవేద్యం

పెడుతూ వుంది. మీరేమో పట్టీ పట్టనట్టు వుంటున్నారు. దేశం పారతంత్ర్యం అంటే మీకేమీ బాధవ్వటంలేదే! మీరు వినాశ మేషాలు లెక్కపెట్టుకుంటూ కూర్చొంటే, సిద్ధహస్తుడు దేశాన్ని కాపాడి మిమ్మల్ని రక్షిస్తాడని అనుకుంటున్నారు. ఇది పొరపాటు. కేవలం పొరపాటు. మిమ్మల్ని మీరే రక్షించుకోవాలి. జపాన్ గానీ జర్మనీ గానీ రావటంవల్ల ఎవ్వరికి నష్టమైనా వారు ఎదురు తిరగాలి గాని, ఫేసిజం వల్ల లాభం పొందేవారిని నమ్మి కూర్చోకూడదు..."

సభికుల్లో రాధాకృష్ణమూర్తి మాటలు ఉత్సాహాన్ని కలిగించలేదు. మొదట్లో అసలు అర్థమే కాలేదు. ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటూ కూర్చున్నారు. ఒక పెద్దమనిషి నేల మీద చెయ్యి ఆన్చి ఊతం తీసుకొని లేచి చేతులు నులుపు కుంటూ ఇలా చెప్పాడు. "మనకేమీ పరవాలేదులే. నువ్వేమీ చెప్పనక్కర్లేదులే! అన్నిటికీ కాంగ్రెస్సే ఉందిలే! గాంధీ మహాత్ముడే వున్నాడులే!"

"అదే పొరపాటు. కాంగ్రెస్ మీకెందుకు చేస్తుంది? కాంగ్రెస్ సంస్థ మిమ్మల్ని ఎప్పుడో విడిచి పెట్టింది. మీ హక్కుల్ని రక్షించటానికి కాంగ్రెస్ ప్రయత్నించటం లేదు."

"మీరు చెప్పింది బలేబాగుందిగా! బూట్ దిరేట్, బూట్ దిరేట్" అని నలుగు రయిదుగురు లేచి కేకలు వేశారు.

నా గుండె జారిపోయింది. ఈ కేకలు ఫిరంగి గుళ్లుగా తగిలినై. కూటస్థుడు గిజగిజ లాడాను. ఆభాసుడు జలాకాశం లోని చంద్రుడు లాగా వణికాను... వీళ్ళు నన్ను చూస్తే?

రాధాకృష్ణమూర్తి మాత్రం తొణక్కుండా నిలబడి చెయ్యి పైకెత్తి బల్లగుద్ది మాట్లాడుతున్నాడు—"చెపుతాను. ఇవన్నీ చెప్పటానికే సనిక్కడికి వొచ్చాను. మన దేశంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్గా లున్నయ్..."

"వాట్, నువ్వు కులతత్వం మాట్లాడుతున్నావ్! సోదరులారా, చూశారా? సోషలిజం పేరుతో ఈ వ్యక్తి—ఈనాలుగు అడుగుల పది అంగుళాల వ్యక్తి - ఈ...ఈ... ఈరాధాకృష్ణమూర్తి నామధేయుడు - మీకు కులతత్వం బోధిస్తున్నాడు చూశారా? తిలకించారా? గమనించారా?

ఆ మాట్లాడేమనిషి, చీకట్లో నాకు కనపడకపోయినా, ఆతని మొహాన విభూది రేఖలు వుంటాయనీ, మెడలో రుద్రాక్ష మాలలు వుంటాయనీ నేను తెలుసుకున్నాను. ఇతని మాటలు విని జనం, 'ఈరోజుల్లో కులతత్వమా?' అని గుసగుసలాడింది.

"ఇది కులతత్వం కాదు—మార్క్సిజం. ఇప్పుడు మన దేశ పరిస్తితులు, మార్క్స్ పుట్టినప్పటి యూరప్ పరిస్థితులకంటె వెనకబడి వున్నవి. కాబట్టి మన దేశంలో, మార్క్సిజాన్ని, మార్క్స్ కాలానికి వెనుక యుగానికి వర్తింప చేసుకోవలసి వచ్చింది. ఆపని మేం చేస్తున్నాం. మన దేశంలోవున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులాలే ఇతర దేశాల్లో-పరిశ్రమలు వృద్ధిపొందిన దేశాల్లో ప్రాజారీ, జమీందారీ, కేపిటలిస్టు, ప్రోలిటేరియన్ వర్గాలంటున్నారు. మన దేశంలో పూర్వం విశ్వామిత్రుడు చేసిన విప్లవమూ, వసిష్టుడుచేసిన ప్రతిఘటనా, పరశురాముడు చేసిన విప్లవనాశనం, బుద్ధుడుచేసిన విప్లవం,

శంకరాచార్యులు వర్ణాశ్రమధర్మాల పేరుతో జరిపిన విప్లవ నాశనం—అన్నీ అప్పటికి మనసంఘంలో వున్న వర్గకలహాం ఫలితాలు! కాని మతంపేరు మీదగా జరగటంవల్ల, ఈ సత్యాన్ని, ఈఉద్యమాల యదార్థ స్వరూపాల్ని మీరు గ్రహించలేకుండా వున్నారు. అనాదినుంచి మన దేశంలోకూడా వర్గ కలహాం జరుగుతూనే వుంది. కాని విప్లవశక్తులు ఎప్పటికప్పుడు నాశనం అయిపోనటంవల్లా, తరవాత వచ్చే వర్గాల నాయకత్వాన్ని, ఎప్పటి కప్పుడు మొదటి వర్గమే సొంతం చేసుకొని, తప్పుదార్లను పట్టించటంవల్లా ఇప్పటికీ మొదటి వర్గం వాసన—గవులే అవ్వొచ్చు— మన సంఘాన్ని వొదల్లేదు.

బ్రహ్మర్షి అనిపించుకునే హక్కు మాకూ వుందనీ, అగ్ర జాతికి ప్రత్యేక హక్కు లుండగూడదనీ చెప్పి విశ్వామిత్రుడు క్షత్రియులనుకూడ గట్టుకొని విప్లవం చేయించాడు. ఈ విప్లవమే విశ్వామిత్ర వశిష్టులమధ్య జరిగిన పోరాటంగా మన పురాణాలు వర్ణించాయి. వసిష్టుడు ఎలుకైతే విశ్వామిత్రుడు పిల్లి అయి వెంటబడ్డాడు. వసిష్టుడు పిల్లిఅయితే విశ్వామిత్రుడు కుక్కయి వెంట బడ్డాడు. వసిష్టుడు కుక్కయితే విశ్వామిత్రుడు దుడ్డుకర్రయి వెంటపడ్డాడు.

ఇంతేకాదు. క్షత్రియులందర్నీ ఏకం చెయ్యటానిగ్గాను దశరథుని కొడుకైన రామునికి జనక మహారాజు కూతురైన సీత నిచ్చి పెళ్ళిచేయించాడు.

ఇన్నిచేసినా అతని ప్రయత్నాలు ఫలించలేదు పురాణాలు చెప్పే ఈక్రింది కథే దీనికి దృష్టాంతరం.

విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అనిపించుకోటానికి ఘోరతపస్సు చేశాడు. ఇంద్రాదిదేవతలు ప్రత్యక్షమై 'వసిష్టునిచేత బ్రహ్మర్షి అనిపించుకున్నావా, నీ తపస్సు పండుతుంది' అని చెప్పారు. అతడు వెంటనే వసిష్టుని దగ్గరకు వెళ్ళాడు.

విశ్వామిత్రుణ్ని చూచి చూట్టంతోనే వసిష్టుడు, "ఏం, రాజర్షీ?" అని సంబోధించాడు.

విశ్వామిత్రుడికి మండిపోయింది. వసిష్టుని కొడుకుని చంపి వెళ్ళి మళ్ళీకొన్నాళ్లు తపస్సు చేశాడు. మళ్ళీ వసిష్టుని దగ్గరకు వచ్చాడు.

అతడు పూర్వంకిమల్లే "ఏం, రాజర్షీ?" అన్నాడు. విశ్వామిత్రుడు పూర్వంకిమల్లె వసిష్టుని రెండో కొడుకుని చంపి వెళ్ళిపోయాడు. మూడోసారికూడా ఇలాగే జరిగింది. నాలుగోసారి మాత్రం వసిష్టుడు "ఏం? రాజర్షీ," అని సంబోధించినా విశ్వామిత్రుడు వసిష్టుని కడసారికొడుకుని చంపకుండా మళ్లాడు.

అప్పుడు వసిష్టులవారు "ఏం బ్రహ్మర్షీ వెల్తున్నావ్?" అన్నాడు. అంటే విశ్వామిత్రుడు కోపాన్ని జయించాడు గనక బ్రహ్మర్షి అయ్యాడని వసిష్టుల వారి తాత్పర్యం. కాని జరిగిందేమంటే విశ్వామిత్రుడు తన విప్లవ తత్వానికి ఉద్వాసం చెప్పాడు గనక వసిష్టులవారు అతన్ని తమ ముఠాలో జేర్చుకున్నా రన్నమాట.

విశ్వామిత్రునివల్ల తయారైన రాములవారిక్కూడా ఈ గతే పట్టింది. అతడు క్షత్రియ పక్షపాతి అవటంవల్ల వసిష్టుల వారు అతన్ని అరణ్యాలపాలు చేసి తమ క్రిష్టాజిననైన భరతు

నికి పట్టంకట్టారు. తమకు విరోధి అయిన జనక్ మహారాజు
కూతుర్ని పెళ్ళి చేసుకోవడమే దీనికి ముఖ్యకారణం.

ఇటువంటి రాములవారుకూడా చివ్వరికి అగ్రజాతిక చాకుడై
మాటిమాటికీ సీతామహాదేవిని ఆర్యఋషులు చెప్పినప్పుడల్లా
వొదిలి పెడితేనేగాని బతికలేకపోయాడు. ఈ ఆత్మ వంచనకు
ఫలితంగా చచ్చిపోయిం తర్వాత మాత్రం దేవుడయ్యాడు.

కనక వర్గకలహం అనాదినుంచీ జరుగుతూనేవుంది. ఇక ఈ
వర్గాల్లో ఒక వర్గానికి పిడికెడులాభం కలగటం అంటే, మరో
వర్గానికి వాకెడు నష్టం అయినప్పుడు వర్గసామరస్యం ఎట్లా
కుదురుతుంది...?"

"హృదయ పరివర్తనం కలిగితే ఎందుకు కుదరదు? మహా
చక్కగా కుదురుతుంది. నువ్వు ధనికవర్గానకి చెందినవాడ
వయినా, హృదయ పరివర్తనం కలిగి శ్రామికవర్గానికి లాభం
కలిగించే సోషలిజం ప్రచారం చెయ్యటంలా?" అన్నాడొకరు
సభికుల్లోనుంచి. ఒకడు ఈలవేశాడు. ఒకడు ఏరోప్లేన్ మోత
చేశాడు. రైల్లో అడుక్కునే బిచ్చగాడికిమల్లే, ఒకడు పొట్ట
మీద మద్దెలదరువు వేస్తున్నాడు.

"ఇంకా మీకు హృదయపరివర్తనంమీద మోజుపోలేదా?"
అని ప్రశ్నతో మొదలుపెట్టాడు రాధాక్రిష్ణమూర్తి. "మన
దేశచరిత్రలో ఎన్నో ఉద్యమాలు హృదయ పరివర్తనాన్ని
నమ్మి విఫలమైనై. బుద్ధునిసంగతే తీసుకోండాం. బుద్ధుడు పై
వర్గాల్లో కలిగించటానికి ప్రయత్నించిన హృదయ పరివర్తన
శంకరాచార్యుల్ని రాకుండాచేసిందా? మళ్ళ వర్ణాశ్రమ ధర్మా

తేలేమా? ప్రపంచంలో ఎక్కడా రాలేదా? అని నీ అనుమానం. తేలేము. రాదు. విప్లవం లేకుండా మార్పు వచ్చినట్లు నీకు భ్రమ కలగటానికి కారణం చెపుతాను విను.

"సీసాలో వున్న నీళ్లకు క్రమక్రమేణా వేడి ఎక్కువ అవుతూ వుంటుంది. నీళ్ళు తుక తుకలాడి పోతావుంటై. సీసాలో నుంచి బయటపట్టానికి బిరడా వుంటం మూలాన వీలుండదు. ఆబిరడాను తన్ని వెయ్యటం కంటే ఆనీళ్ళకు గత్యంతరం వుండదు. బిరడా గట్టిగా వుంటే టప్పున ఎగిరిపోతుంది. వొదులుగా వుంటే వూరికే వూడిపోతుంది. వూడనంత బిగువుగావుంటే సీసాయే బద్దలై పోతుంది. విప్లవమూ అంతే! అధికారవర్గం బలహీనంగా వున్నచోట విప్లవం నిశ్శబ్దంగా జరిగినట్టు కనిపిస్తుంది. కొద్దిగా బలంగా వున్నచోట కొంచం మోత వినిపిస్తుంది. మరీ బలంగా వున్నచోట సంఘమే బ్రహ్మాండమైన మోతతో బద్దలవుతుంది. అధికారవర్గం బలహీనంగా ఉండి విప్లవం నిశ్శబ్దంగా జరిగినచోట, హృదయ పరివర్తనం వల్ల జరిగిందని నువ్వు అనుకుంటున్నావు. ఇది కేవలం పొరపాటు..."

రాధాక్రిష్ణమూర్తి ఇంతవరకు చెప్పేటప్పటికి సభికుల్లో 'నిజమేరా' 'బహుబాగా చెప్పాడురా' 'ఉన్నది ఉన్నట్టు చెప్పాడ్రా' అని గుస గుసలు బయలుదేరినై. వాతావరణం అనుకూలంగా మారుతూ వుందని గ్రహించి రాధాక్రిష్ణమూర్తి గొంతు సవరించుకొని బిగ్గరగా ఉద్రేకపూరితంగా మాట్లాట్టం మొదలు పెట్టాడు. మూలనక్కి గుడ్లు వప్పజెప్పి చూస్తూ వున్న నాకు కొంచం భయం తగ్గింది.

“జాతీయవాదం ఇట్లాంటి సిద్ధాంతాలమీద ఆధారపడి వుండబట్టే ప్రజలకు సహాయం చెయ్యదు. ఒక దశవరకూ జాతీయవాదం విప్లవ పూరితంగా ఉంటుందనే మాట నిజమే. ‘నా దేశం’ అనే అహంకారం మొదట్లో దేశానికి కొంతలాభాన్ని చేకూరుస్తుందనేమాటా నిజమే! కర్మసిద్ధాంతాన్ని ఆధారంచేసుకొని, దేమునిమీద భారంవేసి, బతుకు వెళ్ళబోసుకునే ప్రజల్లో, ఒక లౌకిక ఆదర్శాన్నీ, తీవ్రవాంఛనీ కలిగించి వాళ్ళదృష్టిని సంఘంవైపు త్రిప్పుతుంది కాని లాభం వొచ్చే సమయం వచ్చేటప్పటికి ఉద్యమాన్ని నడిపే నాయకత్వం, ఇతరవర్గాలను మోసంచేసో, అణగదొక్కో తానే అధికారంలో వుండేటట్లూ, తన వర్గానికే లాభాలు వొచ్చేటట్లూ చేసుకుంటుంది, ఈనాడు మన జాతీయవాదానిక్కూడా ఈగతే పట్టింది. పైగా పరదేశం ముంగిట్లో కాచుకొని ఉంటంవల్ల ఈ అపద మరీ హెచ్చింది.

వివరాగ్గా వినండి.

“ఇప్పుడు ప్రపంచం రెండు ముఠాలుగా చీలి యుద్ధంచేస్తూ వుంది - ఒక పక్క ఫేసిజం, ఒక పక్క ప్రజాస్వామికాలు. ప్రతి దేశంలోనూ ఈవిధంగానే జరుగుతూవుంది. ప్రతిదేశంలో అగ్రజాతులు ఫేసిజానికి సహాయం చేస్తున్నవి. ఫేసిజం జయించకపోతే తాము అనుభవిస్తున్న నిరంకుశాధికారం పోతుందని వాటికి తెలుసు. అటువంటప్పుడు ప్రతిదేశంలో వున్న దిగువ వర్గాలు ప్రజాస్వామికాలకు ఎందుకు సహాయం చెయ్యవు? అలా చెయ్యక, ఫేసిజాన్ని గెలిపిస్తే తమగతి ఏమవుతుంది? ప్రజాస్వామికంవల్ల దిగువవర్గాలకు లాభంగనుక, ఈ వర్గాలన్నీ

ఏ దేశంలో వున్నా సరే ప్రజాస్వామ్యాన్ని తన ఉన్నా రక్షణ కోసం సహాయం చేసి తీరాలి!...

ఒక కుర్రవాడు చివాలున లేచి, "అయితే ప్రస్తుతం ఇంగ్లండుకి సహాయం చెయ్యమంటారా యేమిటి?" అని అడిగాడు.

"అవును"

"ఆదయ్యా అసలు రహస్యం. ఆయన్ని కమ్యూనిస్టు పార్టీ. ఇన్ని మాటలు చెప్పింది ఇందుకయ్యా," అని సభికుల్లో ఒకడు [illegible] చేశాడు. 'ఛీ', 'తూత్?' 'ఓరి పిరికి సిగ్గులేనోడా' అని గోల చేసింది జనం. మళ్ళీ నాకు భయం ఎక్కువైంది

రాధాకృష్ణమూర్తి మాత్రం తొణకలేదు. స్థిమితంగా నిలబడి ఉపన్యసిస్తూ చెప్తున్నాడు. "ఇప్పుడు నేను ఇంగ్లండుకి సహాయం చెయ్యమనే చెప్తున్నాను. అలా సహాయం చెయ్యటం ప్రజలకు లాభం గనక చెయ్యమంటున్నాను. దాస్యంలో ఉంచటానికి కాదు. యుద్ధానంతరం ఇంగ్లండు మనల్ని దోచుకునే స్థితిలో ఉండదు. అప్పటికి దిగువ వర్గాలు రాజకీయంగా పలుకుబడిలోకి రాలేకపోతే, పై వర్గానికి చెందిన జాతీయవాదులు అధికారంలోకి వస్తే, ముంచుకొస్తుంది జాగర్త. కనక ఇంగ్లండు వున్నా లేకపోయినా మనకు జాతీయ నిరంకుశత్వం తప్పదు. ఇది తప్పించాలంటే మనకు లాభం కలగాలంటే ఇదే దారి..."

"అయితే స్వరాజ్యం నీకు అక్కర్లేదా?" అని మష్లర్ కుర్రవాడు ప్రశ్నించాడు. అతనివాలకం చూస్తే నాగుండె గుభేలుమన్నది.

రాధాకృష్ణమూర్తి కొంచెంసేపు ఆలోచించాడు. ఒక్క క్షణం ఆగి ఇలా అడిగాడు— "ముందు నీకేసిద్ధాంతం నచ్చుతుందో చెప్పితే నీ ప్రశ్నకు జవాబు చెపుతాను..."

"నేను సోషలిస్టును. సోషలిజం నా ఆదర్శం"

"అయితే విను. నువ్వు స్వరాజ్యం కావాలని ఎందుకు కోరుకుంటున్నావ్? స్వరాజ్యం అంటే సోషలిజమనా? కాదు. కాని స్వరాజ్యం రావటంవల్ల సోషలిజం తెచ్చుకోటానికి తగ్గ వాతావరణం కలుగుతుంది గనకే కదా? అంటే ప్రజాస్వామికం రాగానే పరిశ్రమలు వృద్ధిచెందుతవి గనకా, పరిశ్రమలు వృద్ధి చెందటంవల్ల ప్రొలిటేరియట్ ఏర్పడుతుంది గనకా, అప్పుడు సోషలిజం తెచ్చుకోవచ్చు గనకా! ఇప్పుడు యుద్ధపరిశ్రమల వల్ల ఏ పరిశ్రమల కోసం నువ్వు స్వరాజ్యం కావాలంటున్నావో, ఆపరిశ్రమలను మన దేశంలో ఇంగ్లండే వృద్ధిచేస్తూవుందనుకో. అప్పుడేం జేస్తావు! నాయకత్వమూ అధికారమూ ఫేసిజానికి సానుభూతి చూపే జాతీయ వాదుల చేతుల్లోకి పోకుండా చూచుకోవాలి, యుద్ధానంతరం ఇంగ్లండు ఎలాగూ మనమీద పెత్తనం చేసే స్థితిలో వుండదుగనక అధికారం ఫేసిస్టు సానుభూతి పరుల చేతుల్లో పడకుండాచూసుకుంటేసోషలిజం తేలిగ్గా సాధించ వొచ్చు...అవునా?"

ఈవిధంగా రాధాకృష్ణమూర్తి మరొక గంటసేపు మాట్లాడాడు. ఎందుకనోగాని అతడు మాట్లాడినమాటలు నాకు వినపడలేదు. చేతులు తిప్పటం, పెదవులు కదల్చటం మాత్రమే మూలనక్కివున్న నాకు కనిపించినై. సభికులకుమాత్రం క్రమ

క్రమేణా అతనిమీద మనస్సువటం మాత్రం నేను ఆకట్టాను. "ఆయన చెప్పింది యుక్తియుక్తంగా వుందిరా" "ఆలోచిస్తే నిజమే అనిపిస్తూందిరా?" అనుకుంటున్నారు. ఈమాటలు సహించలేక ఒకకుర్రవాడు లేచి "అతడు రాయిస్టు" "అతడు రాయిస్టు" "మాసికవేస్తున్నాడు," అని కేకలు వేశాడు.

జనమంతా ఒక్కసారి నివ్వెరపోయింది. "రాయిస్టా, ఓరి వీడి..." "వీళ్ళు మసిపూసి మారేడుకాయ చేస్తార్రా" "వీళ్ళతో మాట్లాడకూడదురా" "ఛ, లెండి" "పోదాంరండి" అని గోల బయల్దేరింది. ఖాళీడబ్బాల గలగల మోతకంటే పెద్దమోత బయల్దేరింది...

ఈమోతకు నేను నిద్రలోనుంచి ఉలిక్కిపడి లేచాను. దీపం ఆరిపోయింది. అంతా చీకటిగా ఉంది. రాధాక్రిష్ణమూర్తి ప్రూఫ్‌కాపీ కోసం అటూఇటూ తారట్లాడాను. కాని అది కనిపించలేదు.

సూతాశ్రమం, తెనాలి. గోపీచంద్

వ.రా:—

పరిచయానికి బదులు పీడ కల వ్రాసినందుకు క్షమించాలి.

గోపీ

# ఒక మాట

"ఏంటి! రాధాకృష్ణమూర్తి మన కళ్ళముందు విప్లవం జరుగుతుందంటున్నాడే?" అని సుబ్రహ్మణ్యం కంప్లైంటు చేసాడు. రాయుడు కూడా యిలాగే ప్రశ్నించినట్లు గుర్తు. అసలు యీ అనుమానం ఇండియాలో యిప్పుడు విప్లవం జరుగుతుందా, లేదా అనేది వీళ్ళిద్దరికీ కలిగింది కాదు. సాధారణంగా యితర్లకి కలిగే అనుమానాలు మాలో మేము ప్రశ్నించుకోటం, సమాధానం చెప్పుకోటం మాకు మామూలు. ఇదికూడా అలాంటి ప్రశ్నే.

అసలు యీయుద్ధమే విప్లవయుద్ధం. కాబట్టి వొకయిండియా యేంటి, ప్రపంచంలోనే విప్లవం జరుగుతుందని చెప్పాలి. ఫాసిస్టు శక్తుల్ని నాశనంచేయటానికి మిత్రరాజ్యాలు యుద్ధం చేస్తున్నై. బోలెడంత జననష్టం, సైనికనష్టం కలుగుతుంది. ఒకటికాదు, రెండుకాదు—పది విప్లవాలకోసం జరిగే ప్రయత్నాలు జరుగుతున్నై. ఈయుద్ధంవల్ల ఇండియాలో, ప్రపంచంలో పాతపద్ధతులు పోయి కొత్తపద్ధతులు యేర్పడుతున్నై. ప్రభుత్వాల వున్న పునాదులుపోయి కొత్తపునాదులు ఏర్పడుతున్నై. ప్రజల్లో కొత్తభావాలు, సంఘంలో కొత్త మార్పులు వస్తున్నై. ఇదంతా విప్లవంకాక మరేమిటి?

అయితే, మరి విప్లవం జరుగుతుంటే అందరూ సంతోషిం చాల్సిందే నని చూస్తూ కూర్చుంటే [illegible]దరపు. విప్లవం అంటే గిట్టని వర్గం వొకటుంటుంది. ఆవర్గం విప్లవాన్ని నాశనం చేయ టానికి ప్రయత్నిస్తుంది. ఇండియాలో ఆ ప్రయత్నం గట్టిగా వుంది. కాబట్టి యిక్కడ విప్లవశక్తులు, జరుగుతున్న విప్ల వాన్ని సాంతంగా జరపటానికి మరీ గట్టి ప్రయత్నం చేయాలి. నేను ఈ పుస్తకంలో వ్రాసింది యిదే. ఇండియాలో విప్లవం యెలా జరుగుతుందో, విప్లవ వ్యతిరేక శక్తులు యేంచేస్తు న్నాయో, విప్లవశక్తులు యేం చెయ్యాలో చూపాను.

తెనాలి,<br>19-3-43.

రాధాకృష్ణమూర్తి

# ఇండియాలో విప్లవం

## 1. వర్గపోరాటం

ప్రాచీనకాలంనుంచీ. మానవుడు సంఘంగా యేర్పడ్డప్పటినుంచీ వర్గపోరాటం జరుగుతూనేవున్నది. సాధారణంగా ఆర్థికంగా మరోవర్గంమీద పెత్తనంచేసి అపహరించటం దోపిడీ చేయించుకోవటం, శ్రామికవర్గం శ్రమఫలాలు మొత్తం ఒకవర్గానికి దాస్యంచేస్తూ దరిద్రాన్ని అనుభవించటం సంఘంలో మొదటినుంచీ, యిప్పటికీ జరుగుతూనేవుంది. ఆర్థికపెత్తనం, వర్గభేదాలు వున్నంతవరకూ వొకవర్గం అధికారంలో వుండటం మరోవర్గం దాస్యంలో వుండి దోపిడీచేయించుకుంటం సంఘంలో తప్పదు. సంఘం మొదట్లో మతప్రచారకులు యీ పెత్తనంచేసారు. తక్కిన ప్రజలు యీ ప్రచారకులకు దోపిడీచేస్తూ తాము సంపాదించుకున్న దంతా దేవుడిపేరుతో యీప్రచారకులకు నైవేద్యం అర్పిస్తూవుండేవారు తరువాత జమీందారీవర్గం యీపెత్తనం చేసింది. దాంతరువాత కాపిటలిస్టువర్గం (ధనికవర్గం) యిప్పుడు శ్రామికవర్గంయీ పెత్తనంకోసం ప్రయత్నిస్తుంది. కారల్‌మార్క్స్ చెప్పిన అంచనా ప్రకారం శ్రామికవర్గం తరువాత మరోవర్గం పెత్తనంకోసం యత్నించేది వుండదు. కారణం శ్రామికవర్గంతో వర్గభేదాల నశిస్తవి. కాబట్టి వర్గపోరాటంకాని, వొకవర్గం మరోవర్గంమీా ఆర్థికపెత్తనం చేసే అవసరం కాని వుండదు.

ఇండియా విషయంలో మొదట బ్రాహ్మణవర్గం అధికారాన్ని చేపట్టింది. తరువాత క్షత్రియవర్గం, ఆ తరువాత వైశ్య వర్గం, పెత్తనం చేపట్టినవి. ఇప్పుడు శూద్రవర్గం యీ పెత్తనం కోసం ప్రయత్నిస్తావుంది. కాని తక్కిన దేశాలలో, ఇండియాకు యీ వర్గపోరాటంలో తేడావుంది. తక్కిన దేశాల్లో వర్గపోరాటం తరువాత మరో వర్గం అధికారానికి రావటం జరుగుతూ వచ్చింది. ఇండియా సంగతి వేరు. ఇండియాలో ఇప్పటికీ మొదట మూడు వర్గాలు పెత్తనం చేస్తూ వున్నాయి. కారణం ఇండియాలో యింతవరకూ యే విప్లవం పూర్తిగా జరుగలేదు. ఈ విషయం ముందు విపులంగా చర్చిద్దాము.

కనుక తేలిన విషయం ఆర్థిక పెత్తనం వున్నంతవరకూ వర్గ భేదాలు, వర్గపోరాటాలు తప్పవు. దాస్యంలో వున్న వర్గం అధికారంలో వున్న వర్గంమీద తిరుగుబాటు చేసి తనకు అనుకూలమైన ప్రభుత్వాన్ని స్థాపించుకోలేనంత వరకూ దాస్యాన్ని భరించవలసిందే. అంటే సంఘంలో మార్పు వుండదు. యెంత కాలం అయినా సరే సంఘం అట్లాగే నిర్జీవంగా వుండి పోతుంది.

## విప్లవం—పవిత్ర ఆదర్శం.

విప్లవం అంటే మానవసంఘంలో జరిగే గొప్పమార్పు. (కాని ప్రతిమార్పు విప్లవంకాదు. హిట్లరు 1933 లో అధికారానికి రావటంతో జర్మనీలో మార్పు వచ్చింది ఇది విప్లవ ప్రత్యాఖ్యాతం) దాస్యంలో వున్న వర్గం, అధికారంలో వున్న వర్గంమీద తిరుగు బాటు చేసి స్వాతంత్ర్యం సంపాదిస్తుంది. దీంతో సంఘంలో

కొత్త ప్రభుత్వం వస్తుంది. మార్పులు జరుగుతై. దీనివల్ల సంఘంలో పెనుకటికంటె యెక్కువ మందికి మేలుకలుగుతుంది ఇదే విప్లవం.

ఇలా జరగనంతకాలం సంఘంలో నూతన తేజస్సు వుండదు. దాస్యంలో వున్న వర్గం దాస్యానికే అలవాటుపడిపోతుంది స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలియని స్థితిలో వుండిపోతుంది. చైతన్యం నశిస్తుంది. సంఘంలో సంస్కారం కాని, అభివృద్ధికాని వుండదు. కాబట్టి మానవసంఘ అభివృద్ధికోసం విప్లవం తప్పనిసరి అవుతుంది. విప్లవం జరక్కుండా సంఘం బాగుపడదు. సంఘానికి విప్లవం ప్రాణంలాంటిది.

## మానవచరిత్ర — విప్లవచరిత్ర

మానవచరిత్ర తిరగవేస్తే అంతా విప్లవమయంగా కనబడుతుంది. మతంలోనూ, రాజకీయంగా, యిదివరకు యెన్నో విప్లవాలు జరిగాయి. ఇటాలియన్, డచ్ రిపబ్లిక్కులు, ఇంగ్లండులో క్రామ్‌వెల్ ప్రభుత్వం, జర్మనీలో రైతులతిరుగుబాటు మొదలైనవి విప్లవఫలితాలే. ఇంకా వెనక్కు వెళ్ళితే మహమ్మదు, ఏసుక్రీస్తు, బుద్ధుడు, మొదలైన మతప్రవక్తలు అంతకు ముందున్న మతాలమీద విప్లవంచేసి కొత్తమతాలు స్థాపించారు. కొన్ని విప్లవాలవల్ల ప్రపంచపరిస్థితులే తారుమారు అయ్యే ఫలితాలు యేర్పడ్డవి. పూర్వకాలంలో, ఇండియాలో, వైదికమతం మీద జరిగిన బౌద్ధమతవిప్లవం దాదాపు ఆశియా ఖండాన్నంతా మార్చివేసింది. ఫ్రెంచి విప్లవం ఐరోపా

ఖండంలో మార్పు తెచ్చింది. ప్రపంచానికి స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం' అనే కొత్త ఆదర్శాలు చూపింది. రష్యా విప్లవం ప్రపంచంలో నేడు నూతన పంథా చూపింది. కనుక మానవసంఘం విప్లవాల ద్వారానే యింతవరకూ అభివృద్ధి చెందుతూ వచ్చిందని చెప్పటంలో ఆశ్చర్యంలేదు.

కనుక యీ దృష్టితో చూస్తే విప్లవచరిత్రే మానవచరిత్ర అవుతుంది. విప్లవాలు జరక్కపోతే మానవసంఘం అభివృద్ధి చెందటానికి వీల్లేదు. వేల సంవత్సరాలక్రింద సంఘం యెట్లా వుందో, నేడు కూడా సంఘం అట్లాగే వుండేది. అంటే నేటి విజ్ఞానం వుండేదికాదు. ప్రపంచంలో వారి దేశానికొక దేశానికీ మధ్య రాకపోకలు, సంబంధాలు వుండేవికావు. ఒకే దేశంలోని సంఘంలోకూడా నేటి సంబంధాలు వుండేవికావు. ప్రకృతిని జయించి సంఘంకోసం వినియోగించుకునే అవకాశాలు కాని, సాధనాలుకాని, శక్తికాని వుండేవికావు. అంటే మానవ సంఘం వెనుకటిమాదిరిగా అజ్ఞానంలో పశుత్వంలోవుండేది. ఇప్పటికీ, అప్పటికీ వున్న యీ తేడా కేవలం విప్లవాలవల్ల వచ్చిందే.

## విప్లవంఅంటే గిట్టనివర్గం

విప్లవం అవసరం అనీ, అభివృద్ధిదాయకం అనీ చెప్పాము. కాబట్టి అనుకున్నప్పుడల్లా విప్లవం చేయాలనుకుంటే కుదరదు. విప్లవానికి కావలసిన పరిస్థితులు, విప్లవం జయప్రదం అయ్యే అవకాశాలు యేర్పడాలి. ఆకలి అయినప్పుడల్లా తిండికోసం చూస్తాము. తిండి సంపాదించుకున్నప్పుడే ఆకలిబాధ తీరే అవ

కాశంవుంటుంది. సంపాదించుకున్నది యితరులు కాజేస్తూవుంటే ఆకలి అట్లాగే నిలిచిపోతుంది.

విప్లవం సంఘానికి అభివృద్ధిదాయకం అయినా విప్లవం అంటే గిట్టనిరకం, విప్లవాన్ని నాశనంచేసేరకం, వుంటుంది. దాస్యంలోవున్న వర్గం, బానిసత్వంలోనుంచి విముక్తి చెంద టానికి, స్వాతంత్ర్యం సంపాదించుకోటానికి, పెత్తనంచేసే వర్గం మీద తిరుగుబాటుచేస్తుంది. పెత్తనంచేసే వర్గం యీ తిరుగు బాటును వొప్పుకుంటే తన పెత్తనం పోతుంది. పీడిగం చేయించుకోటానికి, పీడిగంద్వారా యెక్కువ కూడబెట్టుకో టానికి వీల్లేదు. కాబట్టి పెత్తనంచేసేవర్గం యెప్పుడూ సహ జంగా విప్లవానికి వ్యతిరేకంగా వుంటుంది. తన క్రిందవున్న బానిస వర్గంచేసే తిరుగుబాటును అణచి విప్లవంరాకుండా చేస్తుంది. విప్లవం నాశనంచెయటానికి వీలైన కుతంత్రాలన్నీ పన్నుతుంది. ప్రజల్ని మోసపుచ్చి హింసించి తనక్రిందవే యెల్ల కాలం బానిసలుగా వుంచుకోటానికి ప్రయత్నిస్తుంది. పైగా అధికారవర్గంలోవున్న వర్గానికున్నంత తెలివితేటలు, సంఘీ భావబలం బానిసవర్గానికుండదు. కాబట్టి విప్లవం అనుకున్నంత తేలిగ్గాజరగదు. ఒకవేళ వచ్చినా అంతవరకు అధికారంలోవున్న వర్గం విప్లవం నాశనం చేయటానికి తిరిగి ప్రయత్నం చేస్తుంది.

ఇండియాలో, పూర్వకాలంలో బౌద్ధమతం, వైదికమతం మీద తిరుగుబాటుచేసింది. ఇది బ్రాహ్మణవర్గంమీద క్షత్రియ వర్గంచేసిన తిరుగుబాటు. దీనివల్ల బ్రాహ్మణవర్గానికి నష్టం కనబడింది. సంఘంలో అదివరకు తమకున్న అధికారం, పలుకు

బడి నశించింది. ఇంతటితో బ్రాహ్మణవర్గం వూరుకోలేదు. తిరిగి ప్రయత్నంచేసింది. శంకరాచార్యుని నాయకత్వంక్రింద బ్రాహ్మణవర్గం, బౌద్ధమతాన్ని యెదుర్కొని తిరిగి వైదిక మతాన్ని స్థాపించింది. గతయుద్ధానంతరం రష్యాతోపాటు ఐరోపాఖండంలో జర్మనీ, యిటలీ, ఆస్ట్రియా- హంగేరీ మొదలైన దేశాల్లోకూడా విప్లవాలువచ్చాయి. కాని విప్లవవ్యతిరేక వర్గాలు విప్లవాలు నాశనంచేసి తిరిగి తమ అధికారం స్థాపించుకున్నవి. ముస్సోలినీ, హిట్లరు యీవిధంగా అధికారానికి వచ్చినవాళ్లే. కాబట్టి ఆర్థికవైషమ్యం, వర్గభేదాలు వున్నంత కాలం విప్లవం అంటే గిట్టనివాళ్ళు కూడా వుంటారు. వీరు ప్రజాశత్రువులు. వీరితో ముడి పెట్టుకున్నంత కాలం ప్రజానీకం బానిసత్వంలోనే వుంటుంది. ప్రజలు వీరిని కనిపెట్టి వుండాలి.

## విప్లవం రక్తపాతమా?

కొంతమంది దృష్టిలో విప్లవం అంటే రక్తపాతం, జాతిపతనం అనే భావం యేర్పడి పోయింది. ఇది విప్లవం అంటే గిట్టనివాళ్లుచేసే దుష్ప్రచారం. ప్రజల్ని మోసపుచ్చటానికి, యెదురు తిరక్కుండా తమక్రిందే అట్టిపెట్టుకోటానికి, విప్లవం అంటే హేయభావం పుట్టించటానికి పన్నిన కుతంత్రం యిది. జరిగిన విప్లవాలన్ని రక్తపాతం లేకుండానే జరిగాయి. కాని విప్లవ వ్యతిరేకవర్గం విప్లవాన్ని నాశనం చేయటానికి పూనుకున్నప్పుడు విప్లవవర్గం విప్లవాన్ని రక్షించుకోటానికి గత్యంతర

తరం లేక ఆయుధాలు చేపట్టాల్సివుంది. ఫ్రెంచి విప్లవంలోనూ, రష్యావిప్లవంలోనూ, యిదే జరిగింది. కాబట్టి విప్లవ వ్యతిరేక వర్గం చేసే మోసానికి గురి కాకూడదు.

## విప్లవపార్టీ— విప్లవనాయకత్వం

దాస్యంలోవున్న వర్గం దాస్యానికి అలవాటు పడటంచేత, చైతన్యం లేకపోటంచేత స్వాతంత్ర్యం కావాలనీ, కావాలనుకునా సంపాదించే సాధనం తెలుసుకునే పరిస్థితుల్లో వుండదు. యీ అవసరాన్ని, సాధనాన్ని తెలుసుకున్నవాళ్లు యేకొద్ది మందో వుంటారు. వీరే విప్లవకారులు. వీరందరూ విప్లవ పార్టీగా (ప్రజాపార్టీ) చేరి దాస్యంలోవున్న ప్రజలకు యదార్థ పరిస్థితులు చెప్పి, వారందరినీ వొకటిగాచేర్చి విప్లవం జయప్రదం చేయటం వీరికి కర్తవ్యం.

విప్లవం అవసరం అయినా, అందుకు కావలసిన పరిస్థితులు యేర్పడ్డా, విప్లవపార్టీ, విప్లవ నాయకత్వం లేకుండా విప్లవం జరగటం కష్టం. గత యుద్ధానంతరం రష్యాలో విప్లవం గెలవటానికీ, యితర దేశాల్లో వోడిపోటానికీ కారణం రష్యాలో వున్న విప్లవనాయకత్వం తక్కిన దేశాల్లో లేకపోయింది. [illegible] విప్లవాలు వోడిపోటానికి, రష్యాలో గె[illegible] ముఖ్యకారణం. కాబట్టి విప్లవానికి విప్లవపార్టీ, విప్లవ నాయకత్వం అవసరం.

యిండియాలో యింతవరకూ యీ విప్లవనాయకత్వం లేకపోవటం చేతనే యిక్కడ యేవిప్లవం పూర్తిగా జరగలేదు.

వేల సంవత్సరాల నుంచీ ప్రజానీకం దాస్యంలోనే వుంటూ
వచ్చింది. ఇండియాలో వున్నంత విప్లవ అవసరం మరెక్కడా
లేదు. కాని యిండియాలో సరియైన నాయకత్వం లోపించటం
వల్ల యింతవరకు విప్లవాలు జరగలేదు. ఈలోటును తొల
గించటం విప్లవవాదుల కర్తవ్యం. నేడు ఇండియాలో రాడికల్
డెమోక్రాటిక్ పార్టీ యిందుకే స్థాపించబడ్డది. ఇండియాలో
విప్లవం చేయటం యీపార్టీ ఆదర్శం. కాంగ్రెసులాంటి తక్కిన
పార్టీలు యెందుకు విప్లవపార్టీలు కావో, రాడికల్ డెమో
క్రాటిక్ పార్టీ యెలా విప్లవపార్టీ అయిందో ముందు తెలుసు
కుందాము.

## 2. విప్లవం ఎందుకు?

విప్లవపార్టీ, విప్లవనాయకత్వాన్ని గూర్చి చర్చించేముందు
యిండియాలో విప్లవ అవసరాన్ని, వున్న పరిస్థితుల్ని, ఆలో
చించటం అవసరం. ఇప్పటికీ ఇండియా తక్కిన దేశాలకంటే
చాలా వెనుకబడివుంది. కారణం ఇండియాలో యింతవరకూ
యేవిప్లవం పూర్తిగా జరగలేదు, కనుక పరిస్థితులు ఇండి
యాలోవున్నంత అధ్వాన్నంగా మరే దేశంలోనూ లేవు.

బౌద్ధమతం వోడిపోవటంచేత మతంలో జరుగవలసిన
విప్లవం జరగలేదు. ఆధ్యాత్మికతత్వం అలాగే నిలిచిపోయింది.
జమీందారీ విప్లవం, ప్రజాస్వామిక విప్లవం జరుగవలసిన
రోజుల్లో భావదాస్యంలోవున్న ప్రజానీకానికి చైతన్యం లేక
పోవటంచేత, విప్లవనాయకత్వం లోపించటంవల్ల ఆ విప్లవాలు
జరగలేదు. కాగా విదేశీయుల దండయాత్రల్లో యీ విప్ల

వాలు మిళితమైపోయినవి. ఆధునికం అనుకునే నేటిపాశ్చాత్య దేశాలన్నీ యీ అవస్థలన్నీ యెప్పుడో దాటిపోవటంచేత నేడు వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా, సాంఘికంగా ఇండియాకంటె యెన్నోరెట్లు మెరుగ్గా వున్నవి. ఇండియాకూడా యీ పరిస్థితుల్లోవుడాలంటే మనం తప్పకుండా యీఅవస్థలన్నీ దాటాలి. వీటినిదాటనంతవరకు ఇండియా ముందుకూడా యిదేపరిస్థితుల్లో వుంటుంది! కాబట్టి విప్లవం ఇండియాలో జరగవలసినంత అవసరం మరేదేశానికి లేదు.

ఇండియాలో యింతవరకూ యేవిప్లవం పూర్తిగా జరక్కపోవటంచేత సామాజిక పరిస్థితులన్నీ కలగాపులగంగా, యిదమిత్థమని తేల్చటానికి వీలులేకుండా వున్నవి. పెట్టుబడివిధానం వున్న పాశ్చాత్యదేశాల్లో నేడు కాపిటలిస్టువర్గం, శ్రామిక వర్గం అని రెండు వర్గాలేవున్నవి. ఇండియా ఆ పరిస్థితుల్లో లేకపోవటంచేత అక్కడిమాదిరిగా మనం తేలిగ్గా వర్గవిభజన చేయలేము. కాగా అక్కడున్నంత వర్గపోరాటతీవ్రత యిక్కడ లేదు. వేలసంవత్సరాలనాటి సంఘవ్యవస్థ యిప్పటికీ నిలిచి వుంది. ఆనాటి సాంఘిక మూఢాచారాలు, పిచ్చినమ్మకాలు యిప్పటికీ సంఘంలో పాతుకునివున్నవి. ఇప్పటికీ మతప్రచారకులు సంఘంమీద పెత్తనం చేస్తూనేవున్నారు. జమీందారి విధానం, భూస్వామ్యపద్ధతి సాగుతూనేవుంది. పెట్టుబడివిధానం ద్వారా ధనికవర్గం దోపిడీచేస్తూనేవుంది. యీ మూడువర్గాల క్రింద (పై వర్గాలకు 'సేవ') ప్రజానీకం నలిగిపోతూ, వూడిగం చేస్తూ దరిద్రంతో బాధలు అనుభవిస్తుంది.

## మతం — ప్రజాదాస్యం

మతం మత్తుమందులాంటిది. దాని ప్రాబల్యం వున్నంత సేపూ మానవుడు అచేతనావస్థలో వుంటాడు. మానవ ప్రయత్నం అనేది వుండదు. కాబట్టి పెత్తనం చేసేవర్గం ప్రజల్ని దాస్యంలో అట్టిపెట్టటానికి యీ మత్తుమందు యిస్తుంది. ఇండియాలో యీ తంత్రం సాగినంతగా మరెక్కడా సాగలేదు. "ప్రపంచమంతా మిథ్య, శరీరం అనిత్యం, దేవుడు నిత్యం, కర్మానుసారం జీవితం నడుస్తుంది. ఇవి వైదిక మతం బోధించే సిద్ధాంతాలు. ప్రజల్లో యీ తత్వం బాగా జీర్ణించింది. యీ తత్వం వున్నంతవరకూ దాస్యం దాస్యంగా కనబడదు. స్వాతంత్ర్యం సంపాదించాలనే కాంక్షవుండదు. ప్రజలు తాము అనుభవించే దరిద్రానికి కారణం కర్మ అని తృప్తి చెందుతారు. పెత్తనం చేసేవర్గం చేస్తున్న దోపిడీ అని తెలుసుకోలేరు. వర్గపోరాటం వుండదు. ప్రజలు వూడిగం ఇదే చేస్తూనే వుంటారు. అంత్యంలోనే మోక్షం వుందని సంతృప్తి చెందుతారు. ఇదే ఆధ్యాత్మికతత్వం. ఇది ఇండియాలో వున్న ప్రత్యేక గొప్పతనం కాదు. పాశ్చాత్య దేశాలన్నీ అజ్ఞానంలో వున్న కాలంలో యిట్టి పరిస్థితుల్లో వున్నవి.

ఇవీ నేడు యిండియాలో వున్న పరిస్థితులు. సంఘం యిలా వున్నంతకాలం మానవ ప్రయత్నం అనేది వుండదు. మానవ ప్రయత్నం లేకుండా సంఘం అభివృద్ధి చెందదు. కాబట్టి సంఘం ముందుకు వెళ్లాలంటే యీ కుతంత్రాన్ని బద్దలుచేయాలి. సంఘంలో వున్న మూఢాచారాల్ని, పిచ్చినమ్మకాల్ని, మత

కొచ్చిన మహాపురుషుడాయన. ఇండియాలో జరగవలసిన విప్లవంలో యిదొక ఘట్టం.

## జమీందారీ విధానం - రైతు దారిద్ర్యం

ఇప్పటికీ ఇండియాలో జమీందారీ పద్ధతే యెక్కువగావుంది. నూటికి డెబ్బైమందికి పైగా రైతులున్నారు. దేశంలో యెక్కువ వుత్పత్తి, వ్యవసాయం ద్వారానే జరుగుతుంది. కాని రైతు ఇరవైనాలుగు గంటలూ పనిచేసినా దారిద్ర్యంతోనే అవస్థపడుతున్నారు. కుటుంబాన్ని పోషించుకునే పరిస్థితుల్లో లేడు. పిల్లలకు చదువుచెప్పించుకునే శక్తిలేదు. ఋణం తీరిక వుండదు. పల్లెటూరి జీవితం దుర్భరంగావుంది. 'రైతే దేశానికి వెన్నెముక' అంటంలో వున్న రహస్యంయిది.

పండించేది రైతు, కాని అనుభవించేది యింకొకడు. జమీందార్లకూ, భూస్వాములకూ 'జన్మస్వాంతం' అని యెన్నోవేల యెకరాల భూమి వుంది. యీ భూమిని ముక్తాఅని, కవులు అని రైతుసేద్యం చేస్తాడు. పండినదంతా వీరికి అప్పగించటం రైతు చేసేపని. రైతుకు తాను పండించే పొలంమీద హక్కులేదు. కాబట్టి దయాదాక్షిణ్యాలకోసం రైతు, జమీందార్లకూ, భూస్వాములకూ అడుగులొత్తవలసిందే. కొద్దోగొప్పో స్వంత భూమి వున్న రైతుకూడ యిదేస్థితుల్లో వున్నాడు. పండిం దాంట్లో యెక్కువభాగం శిస్తులకు, ఋణాలకు చెల్లించవలసి వుంటుంది. మిగిలేది తక్కువ.

రైతు బాగుపడాలంటే యిప్పటి విధానం పూర్తిగా మారి పోవాలి. జమీందారీ విధానం నశించాలి. ఒకడు ముక్తాకివటం, మరొకడు పండించి యివ్వటం అనేపద్ధతి వుండగూడదు. సేద్యం చేసేరైతుకు భూమిమీద, అందులో పండేదానిమీద హక్కు వుండేటట్లుచేయాలి. శిస్తులభారం తగ్గించాలి. వడ్డీవ్యాపారస్తుల ఋణబాధనుంచి రైతును రక్షించి నియమిత వడ్డీకిడబ్బుదొరికే టట్లు చేయాలి.

## పెట్టుబడి విధానం - దోపిడి పద్ధతి

ఇండియా వలసరాజ్యం కావటంచేత, బ్రిటిషు సామ్రాజ్య వాదం యిక్కడ దోచుకోటానికి కావలసినంత అవకాశం కల్పించుకుంది.

ఇక్కడ ముడిసరుకుల్ని చౌగ్గా ఇంగ్లండుతీసుకొని వెళ్ళటం, అక్కడ సరుకుల్ని తయారుచేసి తిరిగి యెక్కువధరకు మనకు అంటగట్టటం యిప్పటివరకూ బ్రిటిషుసామ్రాజ్యతత్వం చేస్తున్న పని. దీనివల్ల అటు ఇంగ్లండులోకాపిటలిస్టులులాభించారు. ఇటు యిండియాలో ప్రజల్లోదారిద్ర్యం ప్రబలుతూ వచ్చింది. క్రిదంటి యుద్ధఫలితంగా, ఇంగ్లండులో పెట్టుబడిధనం తగ్గటంచేత ఇండి యాలోనే కొన్ని పారిశ్రామిక సంస్థలు స్థాపించటం జరిగింది. దీనిలో ఇంగ్లండు పెట్టుబడిదార్లతోపాటు ఇండియన్ పెట్టుబడి దార్లుకూడ కలిసి దోపిడివిధానం సాగిస్తున్నారు. ప్రస్తుత యుద్ధ ఫలితంగా ఇండియాలో యెక్కువ కర్మాగారాలు స్థాపించవలసి వచ్చింది. దీంతోదేశీయ పెట్టుబడిదార్ల ప్రాబల్యం హెచ్చింది.

ఇప్పటి యంత్రాగారాల్లో మూలధనం అంతా దేశీయ పెట్టుబడిదార్లదే. వెనుకటి యంత్రాగారాల్లో యిక్కడ ఇంగ్లీషు పెట్టుబడిదార్లకున్న వాటాలుకూడా కొంటూ ఇండియన్ పెట్టుబడిదార్లుదోపిడివిధానంలోతమదేపై చేయిగా అట్టిపెట్టుకున్నారు.

యీ పెట్టుబడి విధానం సాగుతున్నంతకాలం ప్రజానీకం, ముఖ్యంగా శ్రామికవర్గం దారిద్ర్యంలో నే వుంటుంది.

ఆర్థికపెత్తనం పెట్టుబడిదార్ల చేతుల్లోవున్నంతకాలం రాజకీయ అధికారం కూడా వీరికేవుంటుంది. సంఘం మొత్తంమీద అభివృద్ధి పొందాలంటే దోపిడీ విధానం నశించాలి. పారిశ్రామిక యంత్రాలు సంఘపరం చేసి సంఘం మొత్తంగా లాభం పొందేటట్లు చూడాలి. కాబట్టి ఇండియాలో జరుగవలసిన విప్లవం, దోపిడీ విధానంలేని ప్రజాప్రభుత్వం, ప్రజారాజ్యం ఏర్పరిచే విప్లవంగా వుండాలి.

## తేలిన విషయాలు

కాబట్టి క్లుప్తంగా చెప్పాలంటే ఇండియాలో నూటికితొంభై మందికి పైగా అజ్ఞాన దశలో, బానిసత్వంలో, దారిద్ర్యంలో వున్నారు. సంఘంలో నూటికి తొంభై మంది యీ స్థితిలో వున్నంత కాలం సంఘం బాగుపడటం, అభివృద్ధి చెందటం అసంభవం. కాబట్టి సంఘం బాగుపడాలంటే యీ ఆటంకాన్నీ తొలిగించాలి. విప్లవంద్వారానే యీ ఆటంకాలన్నీ తొలగుతై. కాబట్టి ఇండియాలో తప్పని సరిగా విప్లవం జరగాలి.

కాని విప్లవ వ్యతిరేక వర్గంకూడా వుంటుందని చెప్పాము. ఇండియాలో విప్లవం జరిగితే రైతులు, శ్రామికులు, తదితర

ప్రజలు బాగుపడతారు. దారిద్ర్యం తగ్గుతుంది. సంఘం అభివృద్ధి చెందుతుంది. కాని బ్రాహ్మణవర్గానికి సంఘంమీద అధికారం వుండదు. విప్లవం అంటే సంఘంలో వున్న మూఢాచారాల్ని, పిచ్చినమ్మకాల్ని కూడా తొలగించటం. కాబట్టి సంఘం వెనుకటిలాగా అంధవిశ్వాసంలో వుండదు. లేకపోతే బ్రాహ్మణవర్గం పెత్తనం చేయటానికి వీల్లేదు. (బ్రాహ్మణవర్గంఅంటే బ్రాహ్మణ కులం కాదు. బ్రాహ్మణ సంస్కారం వున్నవాళ్ళంతా బ్రాహ్మణ వర్గానికి చెందినవారే) జమీందారులకూ భూస్వాములకూ భూమిమీద హక్కు వుండదు. పనిపాటలు చేయకుండా పొలం మక్తాకిచ్చి, కూర్చొని, రైతుల శ్రమతో భోగాలు అనుభవించటానికి వీల్లేదు. పెట్టుబడిదార్లు ఇతరుల శ్రమతో లాభాలు సంపాదించటానికి అవకాశం వుండదు. కాబట్టి యీ మూడు వర్గాలువిప్లవాన్ని యెదిరిస్తవి. విప్లవాన్ని నాశనం చెయటానికి సర్వ విధాలా ప్రయత్నం చేస్తవి.

ప్రజానీకం యీవర్గాన్ని యెదిరించి విప్లవంచేసే పరిస్థితుల్లో లేదు. రైతులు తమకు కవులుకిచ్చిన జమీందారుల్నీ భూస్వాముల్నీ తమదాతలుగా పూజించే పరిస్థితుల్లో వున్నారు. తాము పండించే భూమిమీద తమకు హక్కు యెందుకు వుండదు; యితరులకు యెందుకు వుంటుంది? అని ప్రశ్నించుకునే స్థితిలో లేరు, శ్రామికులుకూడా, రైతులకంటె కొంత సంఘీభావం, చైతన్యం వున్నా, దాదాపు యిదే పరిస్థితిల్లోవున్నారు.

కనుక విప్లవంచేయించే బాధ్యత విప్లవపార్టీది. ఇండియాలో రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ యీ బాధ్యతను నెరవేర్చటానికి

పూనుకుంది. ప్రజానీకాన్ని అజ్ఞానదశనుంచి, బానిసత్వంనుంచి, దారిద్ర్యబాధనుంచి విముక్తిచేయటం యీపార్టీ ఆదర్శం. వర్గ సామరస్యం అనీ, జాతీయ ఐక్యత అనీ, జాతీయప్రభుత్వం అనీ స్వరాజ్యం అనీ విప్లవ వ్యతిరేకవర్గాలు చేసే మోసప్రచారానికి గురిఅయ్యే ప్రజానీకానికి యథార్థ పరిస్థితుల్ని చెప్పి, రాజకీయ చైతన్యం కలిగించి,, సక్రమమార్గాన నడిపి విప్లవం జయప్రదం కానటానికి యీపార్టీ తీవ్రకృషిచేస్తుంది.

## 3. స్వతంత్ర ఇండియా

విప్లవం కావాలంటున్నాము. కాని విప్లవ వ్యతిరేకవర్గం ప్రజల్ని మోసంచేసి విప్లవం జరక్కుండా చేయటానికి ప్రయత్నిస్తుందని కూడా చెప్పాము. ఇండియా పరిస్థితులు యింత వరకూ యిప్పటికూడా యిదే ధోరణిలో నడుస్తున్నవి. లేకపోతే ఇండియాలోని స్వాతంత్ర్యోద్యమం యింతవరకూ జయప్రదం కాకుండా వుంటానికి మరో ప్రబలకారణం కనబడదు.

కాంగ్రెసు పుట్టి ఏభై సంవత్సరాలకు పైగాఅయింది. అప్పటి నుంచీ ఏదో ఏకరూపంలో స్వరాజ్యంకోసం వుద్యమం సాగుతూనే వుంది. రానురాను కాంగ్రెసు బలవత్తర సంస్థకూడా అయింది. వూరూర కాంగ్రెసు సంఘాలు స్థాపించబడ్డవి. ఒకానొకప్పుడు కాంగ్రెసు సభ్యత్వం నలభైలక్షలదాకా కూడా వచ్చింది. ప్రపంచములో మరేదేశంలోకూడా స్వాతంత్ర్యోద్యమం కోసం యేర్పడ్డ యే రాజకీయ సంస్థకూడా సంఖ్యలో యింత పెద్దదిగాలేదు. కాని కాంగ్రెసుద్వారా మనం స్వాతం

త్వాన్ని సంపాదించలేకపోయాము. ఇందుకు కారణం యేమిటి?

కాంగ్రెసు తత్వంలోనే యీలోటువుంది. ఇండియా వలస రాజ్యంగా వున్నంతకాలం దేశీయ పెట్టుబడిదార్లు తమ యిష్టం వచ్చినట్లు పరిశ్రమల్ని స్థాపించి లాభాలకోసం దోపిడీవిధానం సాగించటానికి వీల్లేదు. కాబట్టి తమ హక్కులకోసం దేశీయ బూర్జువావర్గం (వర్తకసంఘం) వుద్యమాన్ని లేవదీసింది. కాని యీ వర్గం సంఖ్యలో చాలతక్కువ. ఈ వర్గం వొక్కటే బ్రిటిషు సామ్రాజ్యతత్వాన్ని యెదిరించి తమకు కావలసిన హక్కులను సంపాదించుకునే స్థితిలో లేదు. కాబట్టి ప్రజా నీకాన్ని కూడదీసి బలం సంపాదించుకోవలసిన అనసరం యేర్ప డ్డది. అందుకోసం స్వరాజ్యవుద్యమాన్ని లేవదీసింది. ప్రజలు 'స్వరాజ్యం' పేరు వినగానే 'తమ రాజ్యం' అనుకుని యీ పెట్టుబడిదారీవర్గాన్ని వెంబడిస్తున్నారు. స్వరాజ్యం కావాలనే ఆవేశంలోపడి యీ వర్గం చెప్పినట్లు చేస్తున్నారు.

కాంగ్రెసు యింతవరకూ యిదేపంథాలో నడుస్తోవుంది. నాయకత్వం బూర్జువావర్గానిది, పెట్టుబడిదార్లది. ప్రజానీకం వీరిని అనుకరిస్తుంది. చెప్పినట్లు చేస్తుంది. కాని బూర్జువా వర్గం, పెట్టుబడిదార్లు యీ వుద్యమాన్ని చాల జాగ్రత్తతో నడుపుతున్నారు. స్వరాజ్యం అంటే యేంటో స్పష్టంగా చెప్ప లేదు. స్వరాజ్యం వస్తే ప్రజలు యెట్లావుంటారో, ___తుస్థితి యేంటో, శ్రామికుని జీవితం యెలావుంటుందో, రాజ్యాంగం యెట్టిదో చెప్పలేదు. చెప్పితే తమ వుద్దేశం నెరవేరదు. తమ రాజ్యం అయితే ప్రజానీకం వెంబడించదు. ప్రజారాజ్యం అయితే

తమకు ప్రయోజనం వుండదు. కాబట్టి 'స్వరాజ్యం' అనే అస్పష్ట నినాదాన్ని లేవదీసి ప్రజల్ని మోసపుచ్చి తాను అధికారం సంపాదించుకోటానికి దేశీయ వర్తకసంఘం ప్రయత్నిస్తుంది. ఈ నినాదంవల్ల ప్రజల్లో కొంత ఉద్రేకం, ఆవేశం కలిగేమాట నిజం. కాని, ప్రజల్లో రాజకీయచైతన్యం లేనంతవరకూ ప్రజలు విప్లవం చేసే పరిస్థితుల్లో వుండరు. ప్రజల్లో రాజకీయ చైతన్యం యేర్పడితే దేశీయ పెట్టుబడిదార్ల (బూర్జువా) నాయకత్వం వుండదు. కాబట్టి ఇటు ప్రజల్లో చైతన్యం కలుగకుండా, అటు తమ నాయకత్వం నాశనమౌకుండా దేశీయ బూర్జువా వర్గం ప్రయత్నిస్తుంది.

ఇప్పటికీ కాంగ్రెసు రాచకీయాలు యీ పరిస్థితుల్లో వుండి పోయినై. కాంగ్రెసు యీ పరిస్థితుల్లో వున్నంతకాలం దేశీయ పెట్టుబడిదార్లకు అనుకూలం అయిన 'స్వరాజ్యం' వస్తుందేమో కాని 'ప్రజారాజ్యం' రావటానికి వీల్లేదు. కాంగ్రెసులోని బూర్జువా నాయకత్వాన్ని తొలగించి, కాంగ్రెసు ద్వారా ప్రజా వుద్యమాన్ని లేవదీయటానికి రాడికల్సు ప్రయత్నించారు. తమ అస్థిత్వానికే ప్రమాదం యేర్పడిందనే భయంతో బూర్జువా వర్గం వీరిని కాంగ్రెసునుంచి తరిమివేసి తమ మార్గాన్ని నిరాటంకం చేసుకుంది.

ప్రస్తుత యుద్ధంవల్ల కాంగ్రెసు అసలు రంగు బయటపడింది. ఈ యుద్ధంలో ఫాసిస్టు శక్తులు (జర్మనీ, జపాను, ఇటలీ దేశాలు) గెలిస్తే ప్రపంచంలో ప్రజాస్వామికం నశిస్తుంది. ఫాసిస్టు శక్తులు నశిస్తే ప్రజాస్వామికం వుంటుంది; ప్రజారాజ్యాలు యేర్పడే అవ

కాశం కలుగుతుంది. కాబట్టి ఫాసిస్టు శక్తులకు వ్యతిరేకంగా యీ యుద్ధంలో పాల్గొనటం విప్లవవాదుల కర్తవ్యం. తనకేదైనా ముట్టచెప్పితేనే యుద్ధంలో పాల్గొంటాననటం విప్లవవాదుల లక్షణంకాదు. కాంగ్రెసు యిదేపని చేసింది. ప్రజలమేలే కాంగ్రెసు ముఖ్యోద్దేశం ప్రజలమేలే అయితే కాంగ్రెసు యీ యుద్ధంలో పాల్గొనాలి. కాంగ్రెసు పాల్గొనలేదు. పైగా యీ యుద్ధానికి వ్యతిరేకం అయింది. అంటే ఫాసిస్టురాజ్యాలకు సహాయం చేయటానికి పూనుకుంది. దేశీయ బూర్జువా వర్గానికి ప్రజారాజ్యంకంటె ఫాసిస్టురాజ్యంలోనే లాభాలు గడించటానికి వీలుంటుంది. కాబట్టి యీ యుద్ధంలో వ్యతిరేకం కావటం యీ వర్గానికి సహజమే. ఈ వర్గంక్రిందవున్న కాంగ్రెసుకు యింతకంటె గత్యంతరం వుండదు. కనుక కాంగ్రెసు చేయవలసినపని చేసింది. కాంగ్రెసు ప్రజాపార్టీ (విప్లవపార్టీ) కాదనటానికి యిదొక ప్రబలసాక్ష్యం.

విప్లవం చేయటానికి ప్రజాపార్టీ (విప్లవపార్టీ) అవసరం. రాడికల్ డెమాక్రాటిక్ పార్టీ యీ బాధ్యతను తీసుకుంది. ఇండియాలో విప్లవం చేయటం, ప్రజారాజ్యం స్థాపించటం యీ పార్టీ ఆదర్శం. 'స్వరాజ్యం' లాగా 'ప్రజారాజ్యం' అనే నినాదాన్ని యీ పార్టీ అస్పష్టంగా వుంచలేదు. ప్రజారాజ్యం అంటే యేమిటో, విప్లవంవస్తే ఇండియా యే పరిస్థితుల్లో వుండాలో యీ పార్టీ వొకచట్టప్రణాళిక యిచ్చింది.

## స్వతంత్రఇండియా రాజ్యాంగసూత్రాలు

(1) పరిపాలనా హక్కు సంపూర్ణంగా ప్రజలకుండాలి. ప్రజా ప్రతినిధులే యీ హక్కు నమలుపరచాలి.

(2) భాషనుబట్టి రాష్ట్రాలు యేర్పరిచి, అన్నిరాష్ట్రాల్లోనూ వొకేరీతిగా ప్రజాస్వామిక చట్టం అమలులో వుండాలి.

(3) భూమి, గనులూ జాతికంతకూ చెందిన సమిష్టి ఆస్తిగా వుండాలి.

(4) ఆధునిక యంత్రగారాలు స్థాపించి వుత్పత్తిని యెక్కువ చేయటానికి ప్రభుత్వం కృషి చేయాలి.

(5) పెద్ద పరిశ్రమలూ, బ్యాంకులూ ప్రభుత్వయాజమాన్యం క్రిందనే వుండాలి.

(6) వ్యవసాయం చేసేరైతులు భూమిశిస్తు చెల్లించే భాధ్యతతో భూమిని స్వంతంగా వుంచుకోవచ్చు. బీదరైతులకు స్థానికపన్నులు తప్ప వేరే శిస్తులబాధ వుండకూడదు.

(7) ఆధునిక యంత్రాలద్వారా సహకార వ్యవసాయవిధానం పెంపొందించాలి.

(8) శ్రామికులకు సరియైన వేతనం నిర్ణయించి వారి జీవిత వ్యయపరిమాణం కాపాడాలి,

(9) ఎవరినీ రోజుకు 6 గంటలకు మిగిలి, వారానికి 6 రోజులకంటె యెక్కువగా పనిచేయించకూడదు. సంవత్సరానికి ఒకనెల సెలవుండాలి. గర్భిణిస్త్రీలకు ప్రసవదినాల్లో మూడు నెలల జీతంమీద సెలవుండాలి.

(10) 16 సంవత్సరాల వరకు పిల్లలందరికి ఉచిత నిర్బంధవిద్య నయలు రచాలి.
(11) ప్రజారోగ్యాన్ని పెంపొందించటం ప్రభుత్వ బాధ్యత.
(12) ప్రజాశత్రువులకు మినహాయించి తక్కిన వారందరికీ పత్రికా, వాక్, సంఘ, మత, వైజ్ఞానిక స్వాతంత్ర్యం వుండాలి.
(13) స్త్రీలకు పురుషులతో పాటు సమాన వారసత్వపు హక్కు వుండాలి.
(14) అల్పసంఖ్యాకులకు అన్ని ప్రజాసంస్థల్లో తగిన రక్షణ లుండాలి.

ఇండియాలో జరగవలసిన విప్లవం, ఇండియాలో యేర్పడే స్వతంత్రప్రభుత్వం యీ విధంగా వుండాలని రాడికల్ డెమో క్రాటిక్ పార్టీ ప్రచారం చేస్తుంది. ఇందులో జమీందారీవిధానానికిగానీ, దేశీయ పెట్టుబడిదార్ల దోపిడీవిధానానికి గానీ చోటులేదు. రైతుదురవస్థ పోతుంది. రైతుకు వ్యవసాయం చేసే భూమిమీద హక్కు వుంటుంది. ఆధునిక యంత్రాల ద్వారా సహకార వ్యవసాయ విధానంద్వారా ఇప్పటికంటె యెక్కువ పండించటానికి వీలుంటుంది. శ్రామికులు ఇప్పటివలె రోజుకు 12 గంటలు పనిచేయుట, పొట్టకు చాలనిజీతం తెచ్చుకోవటం అనేది వుండదు. 6 గంటలకంటె యెక్కువపనిచేయకుండా, యీ 6 గంటల్లోనే తమ జీవితానికి సరిపొయ్యే వేతనం తెచ్చుకొనే పరిస్థితుల్లో వుంటారు. ఆధునిక యంత్రాలద్వారా వుత్పత్తి యెక్కువయటంవల్ల ప్రజలకు కావలసిన వస్తువులు

చౌకగా దొరుకుతవి. కాబట్టి దారిద్ర్యబాధ తగ్గుతుంది. ఉచిత నిర్బంధ విద్య అమల్లో వుంటుంది కాబట్టి ప్రజల్లో అజ్ఞానం పోవటానికి, విజ్ఞానం పెరగటానికి అవకాశాలేర్పడుతవి. స్త్రీలకు కూడా సమాన పౌరసత్వపుహక్కు నివ్వటంవల్ల యింతవరకు పురుషుల క్రింద అనుభవించే బానిసత్వం స్త్రీలకు ముందు వుండదు.

కాబట్టి మొత్తంమీద సంఘం అంతా బాగుపడాలంటే, సంఘంలో వున్న అజ్ఞానం, బానిసత్వం, దారిద్ర్యం పోవాలంటే ఇండియాలో యీ విధానం అమల్లోకి రావాలి. ఇదిజరక్కుండా స్వరాజ్యం అనీ, స్వాతంత్ర్యం అనీ మసిపూసి మారేడుకాయ చేసినందువల్ల ప్రయోజనం లేదు. ప్రయోజనం బూర్జువా వర్గానికి చెందిన యేకొద్దిమందికో వుంటుంది కాని సంఘం యిప్పటిలాగే వుండిపోతుంది.

సంఘం యిప్పటిలాగానే వుంటం చేత యీ బూర్జువా వర్గానికి, పెట్టుబడిదార్లకు శ్రేయస్కరం కాబట్టి యిలావుంటానికే ప్రయత్నిస్తారు. కాంగ్రెసు యిందుకే ప్రయత్నిస్తుంది. కాంగ్రెసు కోరే రాజ్యంలో నూలు వడకటం, రాట్నం తిప్పటం ముఖ్యం. ఆధునిక పరిశ్రమలకు చోటులేదు; కనుక వృత్తి యెక్కువ కావటానికి వీల్లేదు. జమీందారీ వర్గం వుంటుంది. దోపిడీ విధానం సాగుతూనే వుంటుంది. పండించే రైతుకు అనుభవించే హక్కు వుండదు. శ్రామికులకి రక్షణ, వేతన నిర్ణయం వుండదు. కాబట్టి కాంగ్రెసు కోరే, 'స్వరాజ్యం' వచ్చినా సంఘం యిట్లాగే వుంటుంది. విప్లవ వ్యతిరేక వర్గంక్రింద వున్న

కాంగ్రెసు, స్వరాజ్య పేరుతో, స్వాతంత్ర్యం పేరుతో ప్రజల్ని మోసపుచ్చి అధికారానికి రావాలని చూస్తుంది.

ఇవీ నేడు యిండియాలో వున్న పరిస్థితులు. రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ, సంఘం బాగుపడటానికి ముందుకుపోవాలంటుంది. బూర్జువా నాయకత్వంలోనూ, గాంధీ తత్వంలోనూ పుట్టి పెరిగిన కాంగ్రెసు, 'కాదు. సంఘం వెనక్కి పోవాలి. అందులోనే సౌఖ్యం వుందని' చెబుతుంది. ఈ రెండు విధానాల్లో యేది మంచిదో, తమ కేది మేలో నిర్ణయించుకోవలసిన బాధ్యత ప్రజలది. ఆర్థిక సమస్య పరిష్కారం కానంతవరకూ దారిద్ర్యం పోదు. దాని పరిష్కారం కావాలంటే వుత్పత్తి యెక్కువ కావాలి. దోపిడీ విధానం వుండకూడదు. ప్రజాప్రభుత్వం యేర్పడాలి. రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ యిందుకోసం ప్రయత్నిస్తున్నది. కాంగ్రెస్ దీనికి వ్యతిరేకం. కాబట్టి ప్రజలు నిర్ణయించుకోవటం తేలిక.

ఈ యుద్ధంవల్ల యిప్పుడు ఇండియాలో కొత్త సమస్యలు యేర్పడ్డవి. ఈ నాలుగైదు సంవత్సరాల్లో ఇండియాలో యెన్నో మార్పులు జరిగినవి. వీటి ఫలితంగా ఇండియాలో నూతన పరిస్థితులు యేర్పడ్డవి. వీటిని కను తమకనుకూలం చేసుకోవాలని దేశీయ బూర్జువావర్గం పొంచివేసుకుని కూర్చుంది. ప్రజానీకం తమని అనుసరిస్తేగాని యీపని నెరవేరదు. అందుకని 'బ్రిటిషువారు వెళ్ళిపోవాలి' అనే కొత్తనినాదం లేవదీసి ప్రజల్ని మోసపుచ్చుందితు. ఇండియాలో జరిగిన మార్పు

లేంటో, బూర్జువావర్గం జర్మనీ యెలా మోసపుచ్చుతుందో ముందు విచారిద్దాము.

## 4. యుద్ధ ఫలితం

ఈ యుద్ధం కేవలం జర్మనీ, ఇంగ్లండుల మధ్యే జరుగుతుందని అనుకోటం పొరపాటనీ, యిది అంతర్జాతీయ అంతర్యుద్ధంగా మారే అవకాశాలున్నాయనీ, కాబట్టి యీ యుద్ధ ఫలితాలమీద ప్రపంచం, ప్రపంచంలో వొకభాగమైన భారతదేశ భవిష్యత్తు ఆధారపడి వుంటుందనీ రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ యేనాడో, యుద్ధం ఆదిలోనే చెప్పింది. ఈ యుద్ధంవల్ల ఇండియాలో యెంతో మార్పు జరుగుతుందనికూడా యీపార్టీ చెప్పింది. ఈపార్టీ చెప్పినట్లు యిండియాలో యిప్పుడు ఏదైనా మార్పు జరిగిందా, జరిగితే ఆమార్పు విప్లవంగాపరిణమిస్తుందా అనే విషయం ఆలోచిద్దాం.

రాజకీయఅధికారం, ఆర్థికపెత్తనాన్ని బట్టి వుంటుంది. ఆర్థికంగా యెవరు పెత్తనం చేస్తే దేశంలో వారే రాజకీయపెత్తనం కూడా చేయగలుగుతారు. కాబట్టి రాజ్యాంగ యంత్రానికి (స్టేట్) మూలాధారం ఆర్థికపెత్తనం. ఆర్థికపెత్తనంలో మార్పు తీస్తే తప్పకుండా రాజ్యాంగ యంత్రంలో కూడా మార్పు వచ్చి వరుతుంది. ఇండియా ఆర్థిక పరిస్థితుల్లో ఈ మార్పు జరుగుతుంది.

ఇంతవరకూ, బ్రిటిషు వర్తక సంఘం (కాపిటలిస్టులు) మన దేశంలో ఆర్థికంగా పెత్తనం చేయుటంవల్ల రాజ్యాంగ యంత్రం,

ప్రభుత్వంవారి కనుకూలంగా వున్నది. కాని ఈ యుద్ధఫలితంగా యీ అధికారం బ్రిటిషు వర్తకసంఘం చేతుల్లోనుంచి దేశీయ వర్తకసంఘం చేతుల్లోకి వచ్చింది. ఇంకో మూలాధికారం అయిన ఆర్థిక పెత్తనం ఇండియన్ కాపిటలిస్టుల చేతుల్లోకి వచ్చిందన్నమాట. ఇది యెంతవరకు నిజమో ఆలోచించాలి. ఇది గనక నిజం అయితే "జాతీయ ప్రభుత్వం కావాలి", "బ్రిటిషు సామ్రాజ్యతత్వం అధికారాన్నివ్వటానికి యిష్టపడటంలేదు," అని వుద్యమాన్ని లేపే అవసరం వుండదు. అసలు వుద్యమం లేకుండానే యీపని జరుగుతున్నప్పుడు వుద్యమంతో నిమిత్తమే లేదు.

అయితే ప్రభుత్వం యెవరి చేతుల్లో వుంది? మన దేశంలో వున్న రాజకీయపార్టీలద్వారా రాజ్యాంగపరిపాలన చేసే జాతీయ ప్రభుత్వం యింతవరకు యేర్పడలేదు. కాని యింతమాత్రంచేత అధికారం యింకా విదేశీయులచేతుల్లో వుందనుకోటం పొరపాటు. ఇంతవరకు ఇండియా కేవలం వలసరాజ్యంగా, బ్రిటిషు వర్తకసంఘం యిష్టంవచ్చినట్లు తిని, పోగొట్టానికి ధర్మసత్రంగా వుంది. కాని ఇప్పుడు ఇండియా ఆ పరిస్థితుల్లో లేదు. వలస రాజ్యంగా వుండే ఇండియా జాతీయరాజ్యంగా మారుతుంది.

ఇండియాలోని ఆర్థిక జీవితంమీద ఇప్పుడు బ్రిటిషు వర్తకుల పెత్తనం తొలగిపోతుంది. ఇంగ్లండుకివ్వవలసిన ఇండియా ప్రభుత్వ ఋణాలు ఇండియాకు మార్చబడ్డవి. ఈ యుద్ధంవల్ల ఇంగ్లండులో వెనుకటికంటె పరిశ్రమల కోసం యెక్కువ మూల ధనం కావలసి వచ్చింది. ఇండియానుంచి దిగుమతులకంటె

ఎగుమతి చేసే సరకులు హెచ్చుయ్యాయి. (యుద్ధానికి పూర్వం దిగుమతులే హెచ్చుగా వుండేవి.) ఈ పరివర్తనవల్ల అటు బ్రిటిషు వర్తకసంఘం ఇండియాలో పెట్టిన పెట్టుబడిధనాన్ని తీసుకోవటం ఇటు ఇండియా సరకుల్ని ఎగుమతి చేయటం, దీనివల్ల ఇండియా ప్రభుత్వ ఋణాలు తీరిపోవటం సంభవించింది. యుద్ధానికి పూర్వం ఇండియా ప్రభుత్వ ఋణం 1190 కోట్ల పౌనులు. యుద్ధం ప్రారంభం అయ్యేటప్పటికి ఇందులో 732 కోట్లు ఇండియాలో పరిశ్రమలకోసం వినియోగించబడింది. అప్పటికి ఇండియా ప్రభుత్వం ఇంగ్లాండు కివ్వవలసింది 460 కోట్లు. యిప్పటి లెక్కల ప్రకారం ఆ ఋణం అంతా తీరిపోయింది. పైగా ఇంగ్లండే ఇండియాకు 1000 కోట్ల పౌనులు బాకీ తేలింది. ఇదంతా కేవలం ఇండియా సరఫరాదారుగా వుండటం జరిగేదని కాదు. ఇండియాలో పరిశ్రమలు పెంపొందడం వల్ల ఇండియా ఇతర దేశాలకు సరుకుల్ని ఎగుమతి చేసే పరిస్థితుల్లో వుండటం చేత ఈ మార్పు జరిగింది.

ఇంతమార్పు జరిగినా పెట్టుబడిధనం బ్రిటిషు వర్తకసంఘానిదయితే పెత్తనంకూడా వాళ్ళకే వుండిపోతుందనుకోవచ్చు. కాని ఆ పరిస్థితులుకూడా మారిపోయాయి. ఇండియాలో ఇంగ్లండువర్తకుల స్వంత పెట్టుబడిధనం నానాటికి తగ్గిపోతూవుంది. ఈచోటునే దేశీయ వర్తకసంఘం ఆక్రమించుకొంటుంది. ఇండియా ప్రభుత్వ ఋణాలు ఇంగ్లండునుంచి ఇండియాకు ట్రాన్సుఫర్ చేయటంవల్ల రైల్వే, ఇరిగేషన్ డిపార్టుమెంటులు దేశీయ వర్తకసంఘం చేతుల్లోకి వచ్చినవి. ఇదివరకు ఇంగ్లండు వర్తకసంఘం క్రింద

వున్న పరిశ్రమల్లో దేశీయ వర్తకులు పేర్లువేసి అధికారం సంపాదిస్తున్నారు. కొత్తగా పెట్టే పరిశ్రమల్లో కేవలం దేశీయ వర్తకులే పెట్టుబడి పెడుతున్నారు. ఇప్పటి లెక్కల ప్రకారం బ్రిటిషు కాపిటలిస్టుల పెట్టుబడిధనం ఇండియాలో 20 కోట్ల పౌనులకంటె యెక్కువలేదు. దీనిమీద మాంచెస్టరుగార్డియను పత్రిక వ్యాఖ్యానంచేస్తూ "ఇంతకంటె యెక్కువ మూలధనాన్ని ఇంగ్లండు కాపిటలిస్టులు స్వతంత్ర దేశాలైన బ్రెజిల్, అర్జెంటైనాల్లో పెట్టుబడి పెట్టారని" వ్రాసింది. కాబట్టి ఇంగ్లండు వర్తకుల మూలధనం తగ్గటం, దేశీయ వర్తకుల మూలధనం హెచ్చటం చూస్తే ఇండియాలోని ఆర్థిక పెత్తనం ఆచేతుల్లోనుంచి పూర్తిగా యీ చేతుల్లోకి మారిందనే చెప్పవచ్చును. ఆర్థికంగా వచ్చిన యీ మార్పు రాజ్యాంగ యంత్రంలో, ప్రభుత్వంలో ప్రతిబింబిస్తుంది. ఇప్పటికే ప్రభుత్వంలో యీసూచనలు కనబడుతున్నవి. ఆర్థిక శాస్త్రజ్ఞులు యీవిషయాన్ని తెలుసుకోవటం తేలిక. ఇప్పుడు ఇండియా వలసరాజ్యంగానూ లేదు, అటు ప్రభుత్వం సామ్రాజ్యవాదలక్షణాన్ని అంటిపెట్టుకునీ లేదు. త్రాసులో క్రిందనున్న సిబ్బి పైకి లేస్తూవుంటే పైది క్రిందకు వస్తూవుంది ఇక ముల్లు మధ్యకురావటమే ఆలస్యం. ఇండియా వలసరాజ్యం నుంచి జాతీయ రాజ్యంగా మారుతుంది. ప్రభుత్వం సామ్రాజ్యతత్వం నుంచి జాతీయ తత్వానికి దిగుతుంది. ఇదీ నేడు ఇండియాలో యీ యుద్ధంవల్లజరిగిన గొప్పమార్పు.

కొంతమందికి బ్రిటిషు సైన్యాలు యిక్కడ వున్నంత వరకూ బ్రిటిషు పెత్తనంకూడా యిక్కడ యెందుకు వుండదనే

సందేహం వుంటుంది. యుద్ధానంతరంకూడ బ్రిటిషు సైన్యాలు యిక్కడ వుండవా అనే అభిప్రాయం వుండవచ్చు. కాని అట్టి పరిస్థితుల్లోకూడ బ్రిటిషు సామ్రాజ్యవాదం వెనుకటిలాగా తన సామ్రాజ్య తత్వాన్ని నిలుపుకో లేదు.

ఈ యుద్ధం తరువాత బ్రిటిషు సైన్యాల్ని ఇండియాలో యెవరు పోషిస్తారు? మామూలు పరిస్థితుల్లో, శాంతిని నెలకొల్పటానికనే నెపంతో అధికారంలోవున్న వర్గం తన రక్షణ కోసం, ఆర్థిక పెత్తనం చేయటానికి, యెదురు తిరిగే ప్రజల్ని శిక్షించటానికి, మిలిటరీ శక్తిని పోషిస్తుంది. ఈ ఆర్థిక పెత్తనం ఇంగ్లండు చేతుల్లో లేదు. కాబట్టి యుద్ధం తరువాత బ్రిటిషు సామ్రాజ్యతత్వానికి కానీ, బ్రిటిషు వర్తక సంఘానికి కానీ తమ రక్షణకోసం ఇండియాలో మిలిటరీ శక్తిని పోషించే ఆవశ్యకత వుండదు. ఆ స్తిపాస్తులు వున్నప్పుడే వాటిని రక్షించే అవసరం వుంటుంది. అవి లేనప్పుడు రక్షణకూడ అనవసరం. కనుక ఇండియాలో ఇంగ్లండు పెట్టుబడి లేనప్పుడు, ఇంగ్లండు తన సైన్యాల్ని యిక్కడ వుంచి పోషిస్తుందనుకోవటం భ్రమ. కాగా దేశీయ వర్తక సంఘానికే యీ అవసరం వుంటుంది. కనుక మిలిటరీ శక్తిని పోషించే బాధ్యత ఇండియన్ కాపిటలిస్టులే తీసుకొని తమకు అనుకూలంగా మిలిటరీ శక్తిని నిర్మించుకుంటారు. ఇది యిలా వుంచి యుద్ధానంతరం బ్రిటిషు సైన్యాలు ఇండియాలోనే నిలిచిపోతవని అనుకోటం పొరపాటు. సైన్యంలో చేరినవాళ్ళంతా ఇప్పటి యుద్ధావసరంవల్ల చేరారు. యుద్ధం కాగానే వారు మిలిటరీ వృత్తినే అంటిపెట్టుకొని యీ దేశంలో పాతుకు

పోటానికి ప్రయత్నించరు. ఎక్కువమంది తిరిగి తమ దేశం వెళ్ళి తమతమ వెనుకటి వృత్తుల్లో చేరి పనిచేసుకునేవారు. కాబట్టి యేవిధంగా చూచినా బ్రిటిషు సామ్రాజ్యతత్వం వెనుకటిలాగానే ఇండియాలో పెత్తనం చేస్తుందనికానీ, ఇండియా వెనుకటిమోస్తరుగా వలసరాజ్యంగానే వుంటుందని కానీ అనుకోటం తప్పు.

దీనికి తోడుగా మనం గమనించవలసిన విషయం మరొకటి వుంది. యుద్ధానంతరం ఇండియాకు స్వయంనిర్ణయహక్కు ఇవ్వబడుతుందనేవిషయం అంగీకరించబడింది. ప్రస్తుత యుద్ధ ఫలితంగా ఇంగ్లండు, ఇండియా దేశాలకున్న సంబంధంలో కొత్తగా కల్గిన మార్పుల్లో యిదికూడా వొకటి. ఈ హక్కుని ఇంగ్లండు వుపసంహరించుకుంటుందని భయపడనక్కరలేదు. యుద్ధానంతరం ఇంగ్లండులో సామ్రాజ్యతత్వంగానీ, కాపిటలిస్టు ప్రభుత్వంగానీ వుంటానికి ఆస్కారం లేదు. ప్రజా ప్రభుత్వం- ఇప్పటికంటె యెక్కువ ప్రజాస్వామికం గల ప్రభుత్వం యేర్పడుతుంది. ఇప్పటికే యీసూచనలు బాగాకనపడుతున్నై. కనుక ఇండియా కిచ్చిన స్వయంనిర్ణయ హక్కుని ఇంగ్లండులో వచ్చే ప్రభుత్వం యెదిరిస్తుందనుకోటం పొరపాటు. (యీ విషయాలు నా 'ఇండియాభవిష్యత్తు'లో విపులంగా చర్చించబడ్డవి.

## తేలిన విషయాలు

ఆర్థికంగా ఇండియా వలస రాజ్యంనుంచి జాతీయరాజ్యంగా మారుతుంది. ప్రభుత్వం సామ్రాజ్యతత్వం నుంచి జాతీయ

తత్వానికి దారితీస్తుంది. ఒక రాజ్యాంగంలోనుంచి అభివృద్ధికరమైన మరో రాజ్యాంగం బయలుదేరటం అంటే విప్లవం జరగటం. నేడు ఇండియా ఇదే పరిస్థితుల్లో వుంది. అంటే ఇండియాలో నేడు విప్లవం జరుగుతుంది. ఇది ఆశ్చర్యంగానే కనబడుతుంది. కాని వున్న పరిస్థితులివి.

విప్లవం జరుగుతుంది. కాని విప్లవం సాంతంగా జరుగుతుందా, లేదా, విప్లవం వల్ల ప్రజానీకం మేలు పొందుతుందా, లేదా అనేవిషయాలు ముఖ్యం. ఇండియాకిచ్చిన స్వయంనిర్ణయ హక్కు ఇండియాలోని ప్రజానీకానికి చెందితే ఇండియాలో విప్లవం సాంతంగా జరిగినట్లే. ప్రజానీకానికి మేలు కలుగుతుంది. అలా కాకుండా యీ హక్కు దేశీయ పెట్టుబడిదార్లకు సంక్రమిస్తే విప్లవం నాశనం అవుతుంది. బ్రిటిషు పెట్టుబడిదార్ల స్థానం దేశీయ పెట్టుబడిదార్లు ఆక్రమించుకుని పెత్తనం చేస్తారు. అంటే ఇండియాలోని ప్రజానీకం ముందు కూడా బానిసత్వంలోనే వుంటుంది. దోపిడీవిధానం సాగుతూనే వుంటుంది. దారిద్ర్యం హెచ్చుతుంది.

ప్రజానీకానికి స్వయంనిర్ణయ హక్కు లభిస్తే దేశంలో ప్రజారాజ్యం యేర్పడుతుంది. దేశీయ పెట్టుబడిదార్లు పెత్తనం చేయటానికి, దోపిడీ విధానం సాగించటానికి వీల్లేదు. కాబట్టి సహజంగా పెట్టుబడిదారీ వర్గం దీన్ని వ్యతిరేకిస్తుంది. ప్రతి విప్లవం జరిగేటప్పుడు, విప్లవ వ్యతిరేకవర్గం విప్లవాన్ని నాశనం చేయటానికి, విప్లవ ఫలితాలు తమ కనుకూలం చేసుకోటానికి అంతర్యుద్ధం లేవదీస్తుంది. నేడు ఇండియాలో పెట్టుబడిదార్లు ఇదే

తతంగం చేస్తున్నారు. ఇండియాలో కల్గిన మార్పుల్ని తమ కనుకూలం చేసుకోవాలనీ, ఇండియా కిచ్చిన స్వయంనిర్ణయ హక్కు ప్రజానీకానికి చెందకుండా తామే కాజేయాలనీ, అంటే తమ ప్రభుత్వాన్ని స్థాపించుకోవాలనీ దేశీయ పెట్టుబడిదార్లు ప్రయత్నం చేస్తున్నారు.

ఇందుకు ప్రజలు ఎదురుతిరిగితే తమ ఆటలు సాగవు. కాబట్టి ప్రజల్ని మోసంచేసి తమవంకకు తిప్పుకోవాలి. 'బ్రిటిషు వారు వెళ్ళిపోవాలి', 'జాతీయ ప్రభుత్వం కావాలి' అనే నినాదాలు లేవదీసి దేశీయ పెట్టుబడిదారీవర్గం ప్రజల్ని మోసం చేస్తుంది. ప్రజలు కోరవలసింది ప్రజాప్రభుత్వం. జాతీయప్రభుత్వం కాదు. జాతీయ ప్రభుత్వం అంటే దేశీయ పెట్టుబడిదార్ల ప్రభుత్వం అని ప్రజలు తెలుసుకోవాలి.

## 5. ఫాసిస్టు తత్వం

ఫాసిస్టు తత్వం విప్లవాన్ని నాశనం చేయటానికి విప్లవ వ్యతిరేకవర్గం వుపయోగించే అంతిమసాధనం. సోషలిజం అంతర్జాతీయం కావటంచేత దీన్ని ప్రతిఘటించటానికి కాపిటలిజం అంతర్జాతీయంగా ఫాసిజాన్ని సృష్టించింది. విప్లవ శక్తులకు ప్రజాస్వామికం అంటే ప్రీతి. విప్లవ వ్యతిరేకశక్తులకు ఫాసిజం అంటే ప్రేమ. ఫాసిజంద్వారా విప్లవ వ్యతిరేకవర్గం ప్రజాస్వామికాన్ని నాశనం చేస్తుంది. మొట్టమొదట ఇటలీ, తరువాత జర్మనీ, యీ పద్ధతితోనే అచ్చటి ప్రజాస్వామికాన్ని, విప్లవశక్తుల్ని నాశనంచేసి చేసి ఫాసిస్టుప్రభుత్వాలు స్థాపించి తక్కిన దేశాల పెట్టుబడిదారీ వర్గాలకు మార్గం చూపించినవి. ఈ యుద్ధకాలం

లో ఫ్రాన్సు దేశంలోని పెట్టుబడిదారీవర్గం యిదే మార్గాన్ని చేపట్టి ఫాసిస్టు ప్రభుత్వాన్ని స్థాపించింది.

ఇండియాలోని పెట్టుబడిదారీ వర్గంకూడా నేడు యిదే సంధాలో నడవటానికి ప్రయత్నిస్తున్నది. తన చేతుల్లోకి వచ్చిన ఆర్థిక పెత్తనానికి అనుకూలంగా జాతీయ (కాపిటలిస్టు) ప్రభుత్వాన్ని స్థాపించుకుని దాని ద్వారా ప్రజాసామాన్యాన్ని అణగద్రొక్కి దోపిడీవిధానం సాగించటానికి యెత్తులు వేస్తుంది. జాతీయ ప్రభుత్వాలు ప్రజాప్రభుత్వం కావు. పైగా ప్రజల్ని అణచిపెట్టటానికి, ప్రజాస్వామ్యాన్ని నాశనం చేయటానికి ఫాసిస్టు ప్రభుత్వంగా మారుతున్నది. నేడు యిండియా పరిస్థితులు యిదే సంధాలో నడుస్తున్నవి.

నేడు ఇండియాలో పెట్టుబడిదార్లు స్థాపించే ప్రభుత్వం వెనుకటి కాపిటలిస్టు ప్రభుత్వాలవలె ప్రజలకు కొద్దిపాటి హక్కులైనా యీయజాలదు. పూర్వం ఇతర దేశాల్లో జరిగిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల ఫలితంగా ఆ దేశాల్లో జమీందారీ విధానం నాశనం చేయబడ్డది. పెట్టుబడిదారీ విధానం వృద్ధికావటానికి రైతులకూ, శ్రామికులకూ కొన్ని హక్కులు యీయబడ్డవి. ప్రజాస్వామికం పూర్తిగా లేకపోయినా కొంతవరకైనా వుండే అవకాశాలు కల్గినవి. కాని ఇండియాలో పెట్టుబడిదారీ ప్రభుత్వం వస్తే యీ పరిస్థితులైనా వుండవు. కారణం? పెట్టుబడిదారీ వర్గం లాభంకోసం వస్తువుల్ని వుత్పత్తి చేసి వర్తకం చేస్తుంది. ఈ యుద్ధపరిస్థితులవల్ల అన్ని దేశాల్లోను పరిశ్రమలు అభివృద్ధి చెందినై. కనుక దేశీయ పెట్టుబడిదారీ వర్గానికి యితర దేశాల్లో

వ్యాపారం చేయటానికి తగిన అవకాశాలు లేవు. ఇక దేశీయను పరిస్థితులు ఆలోచిద్దామా అంటే ప్రజలు దారిద్ర్యం అనుభవిస్తూ వున్నారు. కొనుగోలు శక్తి లేదు. కనుక వుత్పత్తి అయిన వస్తువుల్ని కొనుక్కునే స్థితిలో లేదు. ప్రజ ఏస్థితిలో వున్నా పెట్టుబడిదారీ వర్గానికి కావలసింది లాభాలు. ఇందుకు మార్గాలు లేకపో లేదు. ఇటు జపాను, అటు జర్మనీ దేశాలే యిందుకు తార్కాణం. జపాను దేశంలోని పెట్టుబడిదారీ వర్గం శ్రామికులకు వేతనాలు తగ్గించి యిస్తుంది. అలా తక్కువ వేతనాలతో వుత్పత్తి చేసిన వస్తువుల్ని యితర దేశాల్లో తక్కువ ధరల కమ్ముతూ విదేశీ మార్కెట్లలో పోటీచేస్తుంది. ఇక జర్మనీ సంగతి ఆలోచిద్దాం. అక్కడి శ్రామికవర్గం జపాను దేశంలోని శ్రామికవర్గం అంత అజ్ఞానంలో లేదు. కొంతవరకు చైతన్యం వుంది. సగం కూలీకి లోబడే వర్గం కాదు. కనుక అక్కడి పెట్టుబడిదారీ వర్గం ప్రజలకు కావలసిన వస్తువుల్ని వుత్పత్తి చేయటం తగ్గించి యుద్ధపరికరాలను వుత్పత్తి చేస్తుంది. ప్రభుత్వం తమదే కాబట్టి యీ యుద్ధ పరికరాల ద్వారా అంటే ప్రభుత్వానికే వీటిని అమ్ముతూ వారు లాభాలు సంపాదిస్తున్నారు.

కనుక పద్ధతిలో తేడావున్నా ఫలితం వొకటే. రెండు దేశాల్లోనూ ప్రజలు హీనస్థితిలో వున్నారు. పెట్టుబడిదార్లు వరకంద్వారా లాభాలు సంపాదిస్తున్నారు. విప్లవాలు వస్తాయేమో, ప్రజలు యెదురు తిరుగుతారేమో అన్న భయంతో మిలిటరీ శక్తిని అభివృద్ధిచేసి ఫాసిస్టు ప్రభుత్వాలు స్థాపించటం

యూరొపు దేశాల్లో తప్పనిసరి అయిపోయింది. వీటి పద్ధతులు, ఫలితాలు మన దేశము పెట్టుబడిదారీ వర్గానికూడా తెలుసు. ఆ ప్రభుత్వాలు ప్రజాస్వామికాన్ని యెలా అణచి వేస్తున్నవో కూడా తెలుసు. కనుక యిక్కడ వారు అధికారం చేపట్టితే యిదే పద్ధతి నవలంబిస్తారు. యిందులో సందేహం లేదు.

లేకపోతే నేడు ఇండియాలో ఆహార పదార్థాల కోసం, ఇతర వస్తువులకోసం, జరిగే [illegible]డకి అసంతృప్తికి అర్థంలేదు. విదేశాలకు యెగుమతి అవుతున్నవని మిలిటరీకోసం ఎక్కువఖర్చు అవుతుందని కాబట్టి ఆహారపదార్థాలు వెనుకటికంటె తగ్గిపోయినవని పెట్టుబడిదారు ప్రచారంచేస్తూ ప్రజల్ని మోసపుచ్చుతున్నారు. మిలిటరీలో చేరేవాళ్ళంతా యిండియాప్రజలే కాబట్టి వారు బయటవున్నా మిలిటరీలో చేరినా అదేతిండి తింటారు. లేకపోతే జీవితపరిస్థితులలో కొంత పెరిగి కొంతవరకు ఖర్చు హెచ్చుకావచ్చు. కాని ఆహారపదార్థాల కోసం ఆందోళన జరుగవలసినంత ఖర్చు కావడంలేదు. విదేశాలకు ఎగుమతి చేసేఆహారపదార్థాలుకూడా చాల తక్కువ. యిదివరకు బర్మా, సయాము దేశాలనుంచి మనకు బియ్యము దిగుమతి అవుతూ వుండేవి. కాని జపాను యుద్ధం తరువాత ఆదిగుమతులు ఆగి పోయినవి. దానివల్ల ఆహారపదార్థాల్లో కొంతతరుగుకనపడచ్చు. కాని దీన్ని భర్తీచేయటానికి ఇప్పటిలెక్కల ప్రకారం 81 లక్షల యెకరాలు క్రొత్తగా సాగుచేయబడ్డవి. కాబట్టి ఆహారపదార్థాల్లో సమాన పంపకంవుంటే నేడు మన దేశంలోవున్న అసంతృప్తికి కారణం వుండదు.

కాని అసలువిషయం, యీ అసంతృప్తికి కారణం దేశీయ పెట్టుబడిదార్లే. సరకుల్ని నిలువచేసి మార్కెట్టుకు రాకుండా దాచిపెట్టుతున్నారు. ధరలు విరివిగా పెంచి తమకు ఇష్టంవచ్చినట్లు లాభాలు సంపాదిస్తున్నారు. మామూలు ప్రజలకంటె వ్యాపారస్తులు యెక్కువ తెలివితేటలలోను, సంఘీభావంలోను వుంటారు. పైగా ఆర్థికంగా ప్రజానీకానికున్నంత అవసరం వాళ్ళకుండదు కాబట్టి సరకుల్ని విడుదలచేయకుండా దాచిపెట్టుకుంటున్నారు. రైతు తన జీవిత అవసరంకోసం పండించుచున్నది వెంటనే అమ్ముకోవలసివస్తుంది. వ్యాపారస్తుడు దీన్ని చౌకగా కొనుక్కొని తిరిగి మార్కెట్టుకు రాకుండా నిల్వచేసుకుంటున్నాడు. దీనివల్ల ధరలు విపరీతంగా పెరిగిపోతున్నవి. ప్రజలు తిండికి కావలసిన పదార్థాలు కొనుక్కోలేక నానాఅవస్థలు పడుతున్నారు. వస్తు వుంటున్నారు.

ఇదే నేడు ఇండియాలో ఆర్థికంగా రెండువర్గాలమధ్య—పెట్టుబడిదార్లకూ, ప్రజానీకానికీ మధ్య జరిగే అంతర్యుద్ధం. దీన్ని కప్పిపుచ్చటానికి దేశీయ పెట్టుబడిదారీవర్గం ప్రయత్నిస్తుంది. నేడు దేశంలోవున్న అసంతృప్తికి బ్రిటిషుప్రభుత్వం కారణంఅనీ, బ్రిటిషుప్రభుత్వం పోతేనే యీ అవస్థ పోతుందనీ, కనుక ప్రజలు ఇందుకోసం ప్రయత్నించాలనీ పెట్టుబడిదార్లు ప్రచారంచేస్తున్నారు. కాంగ్రెసు 'బ్రిటిషువారు వెళ్ళిపోవాలి' అనే నినాదంతో ప్రారంభించిన వుద్యమంలోని గూఢార్థం యిదే. ప్రజలు తమ అవస్థకు బ్రిటిషుప్రభుత్వమే కారణం

అనుకుంటున్నారు. దేశీయ పెట్టుబడిదారని తెలుసుకోలేక పోతున్నారు.

వ్యాపారస్థుడు తాను కొన్న సరుకుల్ని మార్కెట్టుకు తీసుకునిరావటానికి 'బ్రిటిషు ప్రభుత్వం' అడ్డుతగలడంలేదు. సరుకుని విడుదలచేయకుండా నిల్వచేసుకోమని బోధించటం లేదు. ధరలు విరివిగా పెంచి లాభాలు గడించమని చెప్పటం లేదు. అంతా చేసేది వ్యాపారస్థుడే. దీన్ని కాకుండా చేయటానికి వ్యాపారస్థుడికి అధికారంవుంది. చేసే అవకాశంకూడా వుంది. కాని అలా చేయటంలేదు. ఇది ఫాసిస్టుతత్వం. వర్తకునికి ఫాసిస్టుతత్వంతో వున్న లంకె ప్రజలంటే లేదు. ప్రజలకు కొనుగోలు శక్తిలేకుండా చేయటం, సరుకుల్ని విడుదలచేయకుండా నిలవచేసి, ధరలు పెంచి విరివిగా లాభాలుసంపాదించటం ప్రజల్ని దారిద్ర్యంలో అట్టిపెట్టడం ఫాసిస్టుప్రభుత్వ లక్షణాలు. ఇప్పటి ఫాసిస్టు దేశాలన్నీ ఇదే పరిస్థితుల్లో వున్నవి. ఇండియాలోని ధనికవర్గంకూడా ఇదే పంథా తొక్కుతుంది.

1932 లో జర్మనీ ఇదే పరిస్థితుల్లోవుంది. అప్పటికి జర్మనీలో రిపబ్లికన్ ప్రభుత్వం వుంది. కాని 1914—18 యుద్ధ ఫలితంగా దేశంలో కలిగిన ఆర్థిక దుస్థితిని, ప్రజల్లో చెలరేగిన అసంతృప్తిని పూర్తిగా పరిష్కరించలేకపోయింది. పెట్టుబడిదార్లు ఆర్థికపెత్తనంకోసం, రాజకీయ అధికారంకోసం కాచుకు కూర్చున్నారు. వున్నప్రభుత్వాన్ని తొలగించాలి. ఇందుకు ప్రజల్ని వెంటవేసుకోవాలి. జర్మనీదుస్థితికి వర్సైల్సుసంధి కారణం అని ప్రచారంచేశారు. వున్నప్రభుత్వానికి ఆ సంధిని

భగ్నంచేసే బలం లేదన్నారు. కాబట్టి వేరో ప్రభుత్వం కావా లన్నారు. ప్రజలు నిజమేననుకుని పెట్టుబడిదార్లను పోషించి వున్న ప్రభుత్వాన్ని తొలగించారు. పెట్టుబడిదార్ల నాయకు డైన హిట్లరు నాయకత్వాన్ని అంగీకరించారు. హిట్లరు పెత్త నానికిరాగానే ఫాసిస్టుప్రభుత్వం స్థాపించి ప్రజాస్వామికాన్ని మొదలంటా నాశనంచేశాడు. మొట్టమొదట తెలుసుకోని ప్రజలు, తరువాత తెలుసుకున్నారు కాని ప్రయోజనం ?—? నేడు ఇండియాలోకూడ పెట్టుబడిదారీవర్గం ఇదే ప్రచారం చేస్తుంది. ఆర్థికదుస్థితిని తొలగించటానికి, వున్న ప్రభుత్వం చాలదంటుంది. జాతీయప్రభుత్వం కావాలంటుంది. కాంగ్రెసు అనే ముసుగులో, 'మహాత్ముని' ముందుపెట్టి యీ తతంగం అంతాచేస్తుంది. ప్రజలు కాంగ్రెసు జాతీయసంస్థ, మహాత్ముడు మహాత్ముడే అన్నభావంతో దేశీయ పెట్టుబడిదార్లు తవ్విన గోతిలో పడబోతున్నారు.

నేటి ఇండియాప్రభుత్వం చేయిచేసుకుంటే యీ సమస్యని పరిష్కరించగలదు. లాభాలు సంపాదించడానికి ధరలుపెంచే మధ్యబేరగాళ్ళని తీసివేసి ఆహారపదార్థాలు అందరికీ అందు బాటులో వుండేటట్లు సమానపంపకం చేసేశక్తి ప్రభుత్వానికుంది. కాని ప్రభుత్వం అలా చేయటంలేదు. ఇంతవరకు ప్రభుత్వం సామ్రాజ్యతత్వంలో పెరిగిందికాబట్టి దాన్ని వొదిలిపెట్ట లేకుండావుంది. పెట్టుబడిదారుల చర్యల్ని కాదనలేకుండావుంది. నామకః కొన్నివస్తువులమీద కంట్రోలుపెట్టి ప్రజల కళ్ళనీళ్లు తుడవటానికి ప్రయత్నిస్తుంది.

పెట్టుబడిదార్ల కుతంత్రాన్ని భగ్నంచేయాలన్నా, ఆర్థిక సమస్యని పరిష్కరించాలన్నా సహకారసంఘాలద్వారా, చౌకడిపోలవల్ల కొంతవరకు సాధ్యమవుతుంది. ప్రతిపట్టణాలలోను, ప్రతిపల్లెలోను సహకారసంఘాలు, చౌకడిపోలువుంటే మధ్యబేరగాడు వుండే అవకాశం వుండదు. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ మధ్యబేరగాళ్ళు లేకుండా చేయుటానికి ఇదే విధానాన్ని సూచించింది. లెనిన్ చెప్పినట్లు సహకారసంఘాలు ప్రజలకు జీవగర్ర — ప్రాణంలాంటిది. కాని ప్రభుత్వం కట్టిపెట్టినట్లు వూరుకుంది. మొత్తంమీదచూస్తే నేటిప్రభుత్వం, ఇడియాలో విప్లవం, విప్లవ వ్యతిరేకశక్తుల మధ్య జరిగే యీ పోరాటంలో విప్లవవ్యతిరేకవర్గాన్నే ఆశ్రయించింది దలాల్ నియామకం కూడా యిందుకు కొంత దోహదాన్నిస్తుంది. పెట్టుబడిదార్ల దగ్గరకు చేరుతున్నకొద్దీ ప్రజలకు దూరంఅవుతుంది. భావి ఫాసిస్టు ప్రభుత్వానికి యిది పునాది. భవననిర్మాణంకోసం ప్రయత్నాలు జరుగుతున్నవి.

## గాంధీతత్త్వం — ఫాసిస్టుతత్వం

ఈ పరిస్థితులిలావుండగా వస్తుతః గాంధీతత్వం కావడంచేత గాంధీతత్వంలోవున్న కాంగ్రెసు, పెట్టుబడిదార్లకు మంచి అవకాశాన్నిచ్చింది. గాంధీ ఫాసిస్టుఅంటే చాలామందికి ఆశ్చర్యం వేస్తుంది. మనస్సుకి కష్టంకూడా కలుగుతుంది. అసలు ఫాసిజాన్ని మన దేశంలో సరిగ్గా అర్థం చేసుకోకపోవటంవల్లనే యీ ప్రమాదం జరుగుతుంది. ఫాసిజం అంటే వొక ఘోరరాక్షసి,

గానో, మహా కాళిలాగానో, హింసా పిపాసిగానో, చూస్తుం టంవల్ల గాంధిగారు ఫాసిస్టు అనగానే ప్రతివాడూ చెవులు మూసుకొని గుడ్లెర్రజేయుటం పరిపాటి అయిపోయింది. ఫాసిజం అంటే యిదికాదు. దీనికి వేరే అర్థంవుంది, తత్వంవుంది అని తెలుసుకుంటే యీ తికమకలు బయలుదేరవు.

ఫాసిజంవున్న సాంఘికవ్యవస్థను ముందుకు అభివృద్ధి చెంద నియ్యదు. పైగా ఆవ్యవస్థను నాశనంచేసి జమీందారీ యుగం లోవున్న సాంఘిక వ్యవస్థను మానవుల్ని నెట్టుతుంది. అంటే ప్రజానీకాన్ని అజ్ఞానంలో, దాస్యభావంలో, దారిద్ర్యంలో అట్టిపెట్టటం దీని ఆశయం. ఇది పెట్టుబడిదారీ వర్గానికి లాభం. కనుక పెట్టుబడిదారీవర్గం దీన్ని ఆయుధంగా చేపట్టింది. జర్మనీలో ప్రజానీకాన్ని శ్రామికవర్గాన్ని యీస్థితికి నెట్టాలంటే యిది తేలిగ్గా జరిగే పనికాదు. అక్కడివర్గం హిట్లరు రాకముందు స్వేచ్ఛ ననుభవించింది. ప్రజాస్వామికం, స్వాతంత్ర్యం అంటే యేంటో తెలుసు. చైతన్యం, సంఘీభావం వుంది. కనుక అట్టి వర్గానికి తిరిగి అజ్ఞానంలో, దాస్యంలో అట్టిపెట్టాలంటే హింసా పద్ధతి కావలసివచ్చింది. హిట్లరు యిదేపద్ధతి యవలంబించాడు.

ఇక గాంధిగారిసంగతి ఆలోచిద్దాం. మన దేశీయ పరిస్థితులు మన సాంఘిక పరిస్థితులు జర్మనీలో పెట్టుబడిదారీవర్గం ఫాసిజం ద్వారా సంఘాన్ని, ప్రజల్ని ఏ స్థితిలో వుంచాలనుకుందో ఆ పరిస్థితుల్లోనేవుంది. కనుక యిక్కడ అక్కడిలాగా హింసాపద్ధతి అవలంబించటం అనవసరం. గాంధిగారు అహింసా సిద్ధాంతం ద్వారా బానిసత్వంలో, అజ్ఞానంలోవున్న ప్రజానీకాన్ని వారిలో

వున్న వుద్రేకాన్ని, కాంక్షను, ప్రతిక్రియను చిదిమివేసి అచేత నం చేస్తున్నాడు. నిద్రాణంలోవున్న సంఘాన్ని అలాగే వుంచ టానికి హింసాపద్ధతి అనవసరం. ఆ అవస్థను అలాగే వుంచ గలిగితే చాలు. ఎద్దు ముక్కుకి తాడుగట్టినట్టు గాంధిగారు తమ అహింసా సిద్ధాంతం అనే కళ్ళెంతో మానవుడిలోవున్న పలుకు కాస్తా బయటకు రాకుండా చేస్తున్నాడు. హిట్లరు హింసాపద్ధతితో అక్కడి జనాన్ని తొక్కిపట్టి వుంచితే గాంధి అహింసా సిద్ధాంతంలో యిక్కడి జనాన్ని పైకి రాకుండా చేస్తున్నాడు. హిట్లరు ఎదిగిన మొక్కను చిదిమివేశాడు. గాంధి అసలు బీజం మొలకెత్తకుండానే చేస్తున్నాడు. భేదం అంతే. కాని ఫలితం ఒకటే.

ఈమధ్య బ్రిటిషుప్రధాని చర్చిలు "కాంగ్రెసు కేవలము వర్తకుల ముఠా" అని హెచ్చరించాడు. దీనికి ప్రతిగా జి. యస్. మెహతా (అఖిలభారత వాణిజ్య సంఘ సమ్మేళన కార్యదర్శి) "అవును ఇది గర్వించవలసిన విషయం. వర్తకులు కాంగ్రెసులో చేరుతున్నారంటే యిది జాతీయైక్యతను సూచి స్తుందని" సమాధానం చెప్పాడు. అసలు రహస్యం ఏమంటే కాంగ్రెసు వర్తకులసంఘం అని తెలుసుకుంటే ప్రజలు యెదురు తిరుగుదారేమోనని భయం. కాబట్టి 'జాతీయ ఐక్యత' కోసం చేరుతున్నారని సమాధానంచెప్పి అసలురహస్యాన్ని కప్పిపుచ్చ టానికి ప్రయత్నించాడు. దారిద్ర్యంలోవున్న ప్రజలకు ఐశ్వర్యం అనుభవించే షావుకార్లకు ఐక్యత యెలా కుదురుతుందో?

గాంధీ నిష్కామయోగి. భగవద్గీత ఆయనకు ప్రమాణ గ్రంథం. "నీ పని యేంటో చేసుకో, ఫలితంకోసం యెదురు చూడకు. అసలు ఫలితంకోసం ఆశించి పనిచేయకు" అని భగవద్గీత చెప్తుంది. ఫాసిస్టు తత్వం కూడా యింతే. ప్రజలు తమ పని పాటలు చేసుకుంటూ వుండాలి. దారిద్ర్యంలో వున్నా సరే ఫలితాన్ని అపేక్షించకూడదు. ప్రభుత్వాన్ని దారిద్ర్యం తొలగించమని అడక్కూడదు. యెదురు తిరక్కూడదు. ఆడవాళ్లు పిల్లల్ని కనాలి. వంటచేయాలి. మగవాళ్ళు సైన్యంలో చేరాలి. యుద్ధంచేయాలి. అది వారి ధర్మం. ఇది వీరిధర్మం. కాని యెందుకని ప్రశ్నించకూడదు.

ఫాసిజానికీ, విజ్ఞానానికీ (కల్చర్) చుక్కెదురు. ఫాసిస్టు తత్వంలో విజ్ఞానానికి చోటులేదు. గోబెల్సు విజ్ఞానం (సైన్సు) అంటే తనపాళ్లు మండుతుందని చెప్పాడు. గాంధీ దృష్టిలోనూ అంతే. ఆధునిక విజ్ఞానం అంటే గాంధీకి గిట్టదు. వెనక్కుపోదామంటాడు. అందులోనే ప్రజాక్షేమం వుందంటాడు. వెనుకటి స్థితికి పోవాలనటం తిరిగి మానవుణ్ని అజ్ఞానదశలో అట్టిపెట్టటానికే. అది పనికిరాకే, ముందుకు పోవాలంటున్నాము. కాని ఫాసిస్టు ప్రభుత్వం మానవుణ్ణి అజ్ఞానదశలో పెట్టటానికి ప్రయత్నిస్తుంది. ప్రజలు అజ్ఞానంలోవుంటే ప్రభుత్వానికి ఎదురు తిరిగే స్థితిలో వుండరు. ప్రభుత్వం యెట్లావున్నా నిరాటంకంగా సాగిపోతుంది.

జీవిత అవసరాల్ని తగ్గించటం ఫాసిస్టు లక్షణం. జీవితవ్యయం తగ్గించుకోవాలని, నిరాడంబరజీవితం గడపాలనీ, భోగాలు అను

భవించకూడదనీ ఫాసిస్టు ప్రభుత్వం బోధిస్తుంది. ప్రజలు యిలా వుంటే తనకు కావలసిన అవుసరాలు తగ్గించుకుంటే దారిద్ర్య బాధ, బాధగా కనపడదు. కాబట్టి ప్రభుత్వంమీద తిరుగు బాటుచేసే అవసరం కనబడదు. అందుకని ఫాసిస్టు ప్రభుత్వం ప్రజలకు యీతత్వాన్ని నేర్పుతుంది. గాంధీదృష్టికూడా యింతే. జీవితం నిరాడంబరంగా వుండాలంటాడు. అవసరాలు తగ్గించు కోవాలి. భోగాలకోసం జీవితం తాపత్రయ పడకూడదు అని గాంధీతత్వం బోధిస్తుంది.

ఇవన్నీ అధికారంలోవున్నవర్గం ప్రజల్ని దాస్యంలో అట్టి పెట్టటానికి వుపకరించే సాధనాలు ఈ ఆధ్యాత్మిక భోజనంతో ప్రజలు పొట్టనింపుకోవాలని విప్లవ వ్యతిరేకవర్గం బోధిస్తుంది. భౌతిక అవుసరాలు తీర్చుకోలేని జీవితం జీవితంకాదు. అట్టి సంఘం బ్రతికినా చచ్చినట్లే. సంఘంలో అభివృద్ధి అనేది లేనప్పుడు సంఘం వున్నావొకటే. లేకపోయినా వొకటే.

కాని దీనివల్ల పెట్టుబడిదారీవర్గానికి లాభంవుంది. ప్రజల్ని అజ్ఞానంలో అట్టిపెట్టి యెక్కువకాలం వుద్రేకం చేయించుకో టానికి వీలవుతుంది. కాబట్టి పెట్టుబడిదార్లు యీ సిద్ధాం తాన్నే బలపరుస్తారు. ఫాసిస్టు దేశాల్లోని పెట్టుబడిదార్లు యీ తత్వాన్నే ప్రచారం చేస్తున్నారు. ఇండియాలోని పెట్టుబడి దార్లుకూడ గాంధీని నాయకుణ్ణిచేసి యిదే నాటకం ఆడుతు న్నారు. మహాత్ముని పేరుతో ప్రజల్ని మోసంచేయటం తేలిక. నేడు కాంగ్రెసుకూ గాంధీకి భేదంలేదు. కాంగ్రెసే గాంధీ, గాంధే కాంగ్రెసు. కాంగ్రెసు పేరుతో, గాంధీపేరుతో ప్రచారం

చేయటం, ప్రజల్ని వొప్పించటం కాలేదు. కనుక పెట్టుబడి దారులు తమ నిజస్థితిని మరుగుపరచి కాంగ్రెసు వొప్పుకుందనీ గాంధి చెప్పుతున్నాడనీ ప్రజలకు ఫాసిస్టు తత్వాన్ని బోధిస్తు న్నారు.

## 6. జాతీయ తత్త్వం

నా జాతి, నా దేశం అని పొగడుకోటం, పరజాతి పరదేశం అని ద్వేషించటం ఫాసిస్టు లక్షణం. సోషలిజం అంతర్జాతీయ తత్వాన్ని బోధిస్తుంటే ఫాసిజం దీన్ని ప్రతిఘటించటానికి జాతీయతత్వాన్ని రేకెత్తిస్తుంది. ఫాసిజం రాటుతేలిన జాతీయ వాదం. ప్రజాస్వామికంలేని జాతీయవాదమే ఫాసిస్టుతత్వం. జాతీయ వుద్యమం సాగుతున్నంతకాలం పెట్టుబడిదారీ వర్గం దాని కనుకూలంగా ప్రవర్తిస్తుంది. కాని అధికారంచేపట్టిన తరువాత దాన్ని సుస్థిరంచేసుకోటానికి ఫాసిజాన్ని స్వీకరించి, వున్న ప్రజాస్వామికాన్ని నాశనం చేస్తుంది. ఆధ్యాత్మిక భోజనంతో ప్రజల్ని తృప్తిపరుస్తుంది.

నేడు ఇండియాలోని జాతీయ వుద్యమంకూడా యిదే పంథాలో నడుస్తుంది. దేశీయ పెట్టుబడిదార్లు జాతీయ వుద్య మాన్ని లేపి ఫాసిస్టు ప్రభుత్వం స్థాపించటానికి ప్రయత్నిస్తు న్నారు. వాతావరణంకూడా యిందుకు అనుకూలంగా వుంది. ఈ సందర్భంలో యం. యన్. రాయ్ ఇలా వ్రాశాడు. "ఫాసిజం తూర్పు దేశాలు ప్రవేశిస్తుంది. ఈ తత్వానికి యీ దేశాల్లోని వాతావరణం అనుకూలంగావుంది. ప్రతి జాతీ యోద్యమంలోనూ ఫాసిస్టు బీజాలుంటాయి. ఈమాట చాల

మంది భారత జాతీయవాదులకు ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని ముస్సోలినీ రాజకీయంగా మెజినీ, గారిబాల్డీల సంతతివాడని తెలుసుకున్నప్పుడు జాతీయోద్యమం విప్లవకరంగా వున్నంత కాలం ఫాసిజం వివురుకప్పిన నిప్పువలె వుంటుందని బోధపడుతుంది......ఇండియాలో ఫాసిజంవల్ల వచ్చే ప్రమాదం సునిశితమతులు అనుకునే దానికన్నా హెచ్చుగావుంది...... కారణం ఫాసిస్టు తత్వానికీ మన జాతీయోద్యమ ఆదర్శాలకూ సన్నిహిత సంబధంవుంది."

ఇండియాకు స్వాతంత్ర్యం కావాలంటున్నామంటే ఇండియాలోని పీడిత ప్రజానీకం, పీడించబడకుండా చేయటమే. జమీందార్లకూ, షావుకార్లకూ, పెట్టుబడిదార్లకూ స్వాతంత్ర్యం అనేది అక్కర్లేదు. ప్రజల్లాగా వీరు దారిద్ర్యాన్ని అనుభవించటంలేదు. కాబట్టి వీరుకోరే స్వాతంత్ర్యం ప్రజల్ని యింకా యెక్కువ పీడించటానికి, యింకా యెక్కువగా దోపిడీవిధానం సాగించటానికే. అందుకనే దేశీయ పెట్టుబడిదార్లు జాతీయ ప్రభుత్వం కావాలంటున్నారు. దేశీయ పరిశ్రమలకు రక్షణ వుండాలంటున్నారు.

పెట్టుబడివిధానంలో ముఖ్య వుద్దేశం యంత్రాల ద్వారా వుత్పత్తి చేసిన సరకుల్ని లాభాలకు విక్రయించటం. కాని అసలు వుత్పత్తిచేసిన సరుకుల్ని సంఘానికి అందుబాటులో వుండేటట్లు చేయాలంటే లాభం అనేది వుండకూడదు. వుత్పత్తిని యెక్కువచేసిన ప్రజల అవసరాలు తీర్చగలిగినప్పుడే సంఘం అభివృద్ధిచెందటానికి ప్రజల్లో విజ్ఞానం కలగటానికి వీలుంటుంది.

24 గంటలూ కేవలం పొట్టకోసం పనిచేసికోవలసివస్తే ప్రజల్లో చురుకుదనం వుండదు, అజ్ఞానం నశించదు. కాబట్టి ఇండియాలో జరిగే విప్లవం వుత్పత్తిని ఎక్కువ చేసేదిగానూ వుత్పత్తిని ప్రజలకందరికీ అందుబాటులో వుండేటట్లు చేసేది గానూ వుండాలి. అప్పుడే సంఘం అభివృద్ధి చెందుతుంది.

కాని దేశీయ పెట్టుబడిదార్లు దీనికి వ్యతిరేకం. ప్రజలు యేమైనాసరే, సంఘం యెట్లాపున్నా సరే వీరికి కావలసింది లాభాలు. తమదోపిడీవిధానం నిరాటంకంగా సాగుతూ వుంటం వీరికి ప్రధానం. కాబట్టి వీరికి కావలసినది విప్లవము కాదు, ప్రజా స్వాతంత్ర్యమూ కాదు. వీరుకోరేదే తమస్వార్థం, తమ లాభం, తమ దోపిడీవిధానం. జాతీయతత్వంపేరుతో ప్రజల్ని రెచ్చగొట్టి తమ కార్యం గట్టెక్కించుకోవాలని దేశీయ పెట్టుబడిదార్లు యెత్తులు వేస్తున్నారు.

జాతీయ తత్వం పేరిట జాతీయ ఐక్యత, జాతీయ ప్రభుత్వం అని ప్రజల్లో ప్రచారంచేస్తున్నారు. "జాతీయ ఐక్యతంటే దేశం అంతా వొకటిగావుండాలి. చీలికలు— పెట్టుబడిదార్లనీ, ప్రజలనీ, యజమానులనీ, బానిసలనీ. పైకి తేడా కనిపించ కూడదు. అలా కనుపిస్తే మనలో సంఘీభావం, బలం తగ్గుతుంది. బ్రిటిషు ప్రభుత్వంనుంచి అధికారాన్ని లాక్కోలేము. లాక్కోటానికి మనలో కలతలు వుండగూడదు. జాతీయప్రభుత్వం అంటే, పరజాతి ప్రభుత్వంపోయి స్వజాతిప్రభుత్వం రావటం. జాతీయ ప్రభుత్వం జాతిని రక్షిస్తుంది. పరజాతి ప్రభుత్వంవున్నంతకాలం మనజాతికి రక్షణవుండదు."

ఇవీ దేశీయ పెట్టుబడిదార్లు చేసే ప్రచారాలు. జాతీయతత్వం పేరుతో ప్రజలకు ఫాసిస్టు తత్వాన్ని బోధిస్తున్నారు. జాతీయ ఐక్యత అనీ, జాతీయ ప్రభుత్వంఅనీ ప్రజలకు బోధిస్తూ వారిలో వున్న వర్గచైతన్యాన్ని, విప్లవ శక్తుల్ని నాశనం చేస్తున్నారు. పరజాతి అంటే ద్వేషాన్ని, స్వజాతి అంటే అభిమానాన్నీ కలిగించి తాము అందలం యెక్కటానికి చూస్తున్నారు.

జాతీయ ప్రభుత్వం వస్తుందనుకుందాము. విదేశీయ పెత్తనం పోయి దేశీయ పెత్తనం వస్తుంది. దానివల్ల ప్రజానీకానికి నూటికి తొంభై మందికి పైగావున్న రైతులకు, శ్రామికులకు లాభం యేంజరుగుతుంది? జర్మనీలో, స్పెయినులో, జపానులో, నిన్న మొన్నటిదాకా ఇటలీలో హిట్లరు, ఫ్రాంకో, టోజో, ముసోలినీ నాయకత్వాల క్రింద జాతీయప్రభుత్వాలు వున్నవి. అక్కడ పర ప్రభుత్వాలు లేవు. కాని అక్కడకూడా ప్రజలు దారిద్ర్యంలోనే వున్నారు. జాతిఅంటే జర్మను జాతిగానూ, జపాను జాతిగాను చూడబడటంలేదు. అధికారంలోవున్నవారే జాతిగా పరిగణింప బడుతున్నారు. పాలితవర్గంజాతిగా పరిగణింప బడటంలేదు. కనుక మనదేశంలోకూడా జాతీయ ప్రభుత్వం వస్తే భారత జాతి అంతా రక్షింప బడుతుందనుకోటం భ్రమ. ఇలా జరగాలంటే సోషలిజమేకర్తవ్యం. ఇందుకు పెట్టుబడిదారీ వర్గం వొప్పుకోదు. పైగా తమ అధికారంతో తమజాతిని అంటే పెట్టుబడి దారీవర్గాన్ని రక్షించుకోటానికి అంటే తక్కిన వర్గాల్ని దారిద్యంలో అట్టిపెట్టటానికి ప్రయత్నిస్తుంది. ఇది సహజంకూడాను. కనుక కాంగ్రెసు యీ వర్గాన్ని మినహా

యించీ తక్కున నూటికి తొంభై పైగావున్న రైతుల్ని, శ్రామికుల్ని, ఇదితర జనాన్ని రక్షించటానికి పూనుకుంటే తానుకోరే జాతీయప్రభుత్వం యెలా వుంటుందో స్పష్టంగా ప్రజలకు విప్పి చెప్పాలి. అలా చెప్పకుండా అస్పష్టంగా జాతీయప్రభుత్వం కావాలిఅని, పరజాతి పోవాలని ప్రచారంచేస్తుందంటే యిది ప్రజల మేలుకోసం కాదని వారిని దారిద్ర్యంలో పెట్టిపెట్టడానికే అని అనుకోటంలో సందేహంలేదు. యెందుకంటే నిజంగా ప్రజల మేలుకోసమే కాంగ్రెసు పూనుకుంటే తన ప్రచారంలో కూడా అది కనబడాలి. మాటల్లోనే అవకతవకలు కనబడుతుంటే యిక క్రియలోకూడా అంతే జరుగుతుందనుకోటంలో సందేహంలేదు.

ఈ మధ్య భారత వాణిజ్య సంఘం జాతీయ ప్రభుత్వం లేకపోతే యుద్ధానికి తగినంతగా సహాయం చేయటానికి వీల్లేదని తీర్మానించింది. కాని వాణిజ్యసంఘంవారు (పెట్టుబడిదార్లు) నిజంగా యుద్ధానికి సహాయ చేయదలిస్తే వారు జాతీయ ప్రభుత్వం వచ్చేటంతవరకూ కనిపెట్టుకొని కూర్చోనక్కర లేదు. వారు వుత్పత్తిచేసే సరకుల్ని నిరాటంకంగా వుత్పత్తిచేయటానికి యుద్ధానికి వినియోగించటానిక వారికి అవకాశం వుంది. కాని ఇప్పటి పరిస్థితిలోవారు వుత్పత్తిచేసిన సరుకులకు అనుకున్నంత లాభాలు గడించటానికి వీల్లేదు. జాతీయప్రభుత్వం వస్తే అధికారం అంతా తమచేతపడుతుంది. కాబట్టి తమ యిష్టంవచ్చినట్లు లాభాలు గడించటానికి వీలుంటుంది. కనుక జాతీయ ప్రభుత్వం కావాలని తీర్మానించింది. ఇది తప్ప భారతవాణిజ్య

సంఘానికి, జాతీయ ప్రభుత్వానికి మరో సంబంధం లేదు. జి. యస్. మెహతా "జాతీయ ఐక్యతకోసం వర్తకులు కాంగ్రెసులో చేరుతున్నారని" చెప్పటంలోకూడా యిదే సంబంధంతో చెప్పాడు. కాంగ్రెసు అధికారంలోకి వస్తే వర్తకులు అధికారం లోకి వచ్చినట్లే.

జాతీయతత్వం, జాతీయఐక్యత, జాతీయప్రభుత్వం మొదలైన నినాదాలు ఫాసిస్టునినాదాలు. 1920 లో ముసోలిని వీటిద్వారానే అధికారానికి వచ్చాడు. ఇటలీ ఫాసిస్టు జండా మీద కర్రపుల్లలు కట్టకట్టినట్లు బొమ్మ వుంటుంది, ఇది జాతీయ ఐక్యతను సూచిస్తుంది. హిట్లరు యీ నినాదాలతోనే అధికారానికి వచ్చాడు. హిట్లరుపార్టీ పేరు 'జాతీయ'-సోషలిజం, జండామీద స్వస్తిక జర్మనీ 'జాతి' గొప్పదనాన్ని సూచిస్తుంది. అంటే పరజాతి ద్వేషంకూడా యీ స్వస్తికలోవుంది. నేడు ఇండియాలోకూడ పెట్టుబడిదార్లు ముసోలినీ, హిట్లరు నడచిన మార్గాన్నే నడుస్తున్నారు.

## వీరంతా ప్రజాశత్రువులే

జాతీయవాదికి అంతర్జాతీయదృష్టి వుండదు. బుద్ధిసంకుచితతత్వాన్నే ఆశ్రయిస్తుంది. ముందుచూపు వుండదు. సంఘాభివృద్ధికంటె స్వంతాభివృద్ధినేకోరుతాడు. పెట్టుబడుదారూఅంతే. దోచుకోటం, లాభాలు సంపాదించటం పెట్టుబడిదారుని సహజ లక్షణం. దోపిడీలేకపోతే పెట్టుబడిదారుడేవుండడు. కాబట్టి వీరు ప్రజల మేలుకోరతారనుకోటం పొరపాటు. పైగా వీరిద్దరూ

ప్రజల్ని మోసంచేయటానికి యేకం అవుతారు. అటు జాతీయ వాదులూ, ఇటు పెట్టుబడిదార్లూ యిద్దరూ ప్రజాశత్రువులే. ప్రజలు తమమిత్రులెవరో, శత్రులెవరో తెలుసుకోవాలి. శతువు చెప్పేమాటలకు మోసపోకూడదు. శత్రువుచేసే రాజీలకు లొంగిపోకూడదు. శత్రువుతో ఐకమత్యంకానీ, సంఘీభావంకానీ కూడదు. వుంటే తాను లొంగివపోటం, శత్రువు జయించటం అవుతుంది. తాను తిరిగి దాస్యం వొప్పుకున్నట్లే అవుతుంది.

కాబట్టి నేడు ఇండియాలో ప్రజానీకానికి—— పెట్టుబడిదార్లకూ, విప్లవవర్గానికీ-విప్లవ వ్యతిరేక వర్గానికీ మధ్య జరిగే అంతర్యుద్ధంలో ఐక్యతకుగానీ, సమిష్టిసంఘటనకుగానీ, జాతీయ ప్రభుత్వానికిగానీ చోటులేదు. ఈ యుద్ధం జరగివలసిందే. ఈ యుద్ధంలో ప్రజాపక్షం గెలవాలి. అప్పుడే దేశానికీ, సంఘానికీ ముక్తి వుంటుంది.

## 7. యుద్ధానంతరం

ఈ యుద్ధం అంతర్జాతీయ అంతర్యుద్ధం. కాబట్టి దీనివల్ల ఇండియాలోకూడా మార్పులు జరుగుతవని చెప్పాము. ఇండియాలో వచ్చిన మార్పులేంటోగూడ చర్చించాము. దేశీయ పెట్టుబడిదారీవర్గం జాతీయతత్వం పేరిట ఇండియాలో ఫాసిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నిస్తుందనికూడ తెలుసుకున్నాము. కాబట్టి యుద్ధానంతరం అంతర్జాతీయ పరిస్థితులెలా వుంటవో, వాటిననుసరించి ఇండియా యేపరిస్థితుల్లో వుంటుందో

తెలుసుకోవటం ముఖ్యం. అంతర్జాతీయ పరిస్థితులు విచారిస్తు
న్నామంటే దేశీయ పరిస్థితులు మరచిపోవటంలేదు. విప్లవానికి,
విప్లవ వ్యతిరేక శక్తులకు మధ్యజరిగే యీ ప్రపంచయుద్ధంలో
జాతీయ అంతర్జాతీయ పరిస్థితులు విడదీయటానికి వీల్లేదు. ఈ
యుద్ధంలో పాల్గొనని దేశాలకు యీ యుద్ధఫలితాలు సంక్ర
మించవనుకోటం పొరపాటు యుద్ధంలో పాల్గొన్నా, పాల్గొనక
పోయినా యుద్ధానంతరం యీ యుద్ధ ఫలితాన్నిబట్టి ప్రతి
దేశంలోనూ సాంఘిక, రాజకీయ మార్పులు జరక్క తప్పదు.
కాబట్టి అంతర్జాతీయ దృక్పథంతో మనదేశ పరిస్థితుల్ని అర్థం
చేసుకోటం అవసరం.

ఈ యుద్ధం కొద్దికాలంలోనే అంతం అయ్యేసూచనలు కన
బడుతున్నవి. ఈ యుద్ధంలో ఫాసిస్టురాజ్యాలు వోడిపోయే
సూచనలు కనబడుచున్నవి. మిత్రరాజ్యాలు తాము గెలుస్తా
మనే దృఢనమ్మకంలో వున్నవి. ఇంగ్లండు అమెరికా దేశాలకు
ఇప్పుడు ఈయుద్ధసమస్యకంటె, యీ యుద్ధానంతరం ప్రపంచ
నిర్మాణం ఎలా జరగాలనేదే ప్రధానంగావుంది. భావి ప్రపంచ
నిర్మాణంలో ఇండియా భవిష్యత్తుకూడా యిమిడివుంది కనుక,
ఇండియాసమస్య మనకు ప్రధానంకనుక, యుద్ధానంతరం ప్రపంచ
పరిస్థితులెలా వుంటవో తెలుసుకోవటం మనకు ముఖ్యం.

ఈ యుద్ధంలో మిత్రరాజ్యాలు గెలుస్తవికాబట్టి యుద్ధా
నంతరం ఇంగ్లండు, అమెరికా, రష్యా దేశాల్నిబట్టే ప్రపంచ పున
ర్నిర్మాణం జరుగుతుందనుకోటానికి వీలుంది. రష్యా ఫాసిస్టు
శక్తుల్ని నాశనం చేయటానికి తన సర్వస్వాన్ని ఒడ్డింది. రష్యా

సైనికుల ధైర్యసాహసాలు, రష్యాప్రజల ఉత్సాహం, పట్టుదల యిప్పటికే ప్రపంచాన్ని తారుమారుచేస్తున్నవి. ఫాసిస్టు బలాన్ని నాశనంచేసి రష్యా మహోన్నతం చేయబోతుంది. రష్యా అంటే ప్రపంచంలోని ప్రజాస్వామిక శక్తులకు అభిమానం, నూతన ఉత్సాహం కలుగుతుంది. కాబట్టి భావి ప్రపంచ నిర్మాణంలో రష్యామాటకు విలువ వుంటుందని గ్రహించవచ్చు.

కాని అమెరికాదేశంకూడ భావి ప్రపంచనిర్మాణంలో ముఖ్య పాత్ర తీసుకుంటుంది. అమెరికా, సామ్రాజ్య తత్వంలోవున్న పక్కా కాపిటలిస్టుదేశం. ఈయుద్ధం వచ్చినతరువాత అమెరికా పరిశ్రమల్ని యెక్కువ వృద్ధిచేసుకుంది. సైన్యాల్ని, మిలిటరీ శక్తిని పెంచుకుంది. కాని యుద్ధంలో రష్యామాదిరిగా అమెరికా మిలిటరీ బలాన్ని కానీ, యుద్ధ పరికరాలనుగానీ కోల్పోవటం లేదు. పైగా అరువుకవులు బిల్లుద్వారా ఇతరదేశాలకు, ముఖ్యంగా ఇంగ్లండుకు, యుద్ధపరికరాలు సప్లైచేసి పలుకుబడి సంపాదించుకుంటుంది. ఇది యిలావుంచి అమెరికాకు, సామ్రాజ్యదేశంకాబట్టి సోషలిజం అంటే గిట్టదు. కాబట్టి యీ యుద్ధంలో ఫాసిస్టురాజ్యాల మిలిటరీశక్తిని నాశనం చేయటానికి అమెరికా సహాయపడ్డా పూర్తిగా ఫాసిస్టుతత్వాన్ని, ఫాసిస్టు సిద్ధాంతాన్ని నాశనంచేసి సోషలిస్టు రాజ్యస్థాపనకు పూను కోదు. ఒకవేళ రష్యా ఇందుకు పూనుకున్నా అమెరికా చేయి చేసుకొని యెదురుతిరక్క మానదు.

అసలు రష్యాఫాసిస్టు మిలటరీశక్తిని నాశనంచేసిన తరువాత యిరోపా ఖండాన్నంతా సోషలిస్టు ప్రభుత్వంగా మార్చేటంత

వరకూ యీ యుద్ధాన్ని సాగిస్తుందా అనేది సందేహం— ఇప్పటికే రష్యా యీ యుద్ధంలో చాలా నష్టపడింది. జర్మనీ మిలిటరీశక్తిని పూర్తిగా నాశనం చేసేటప్పటికి ఇంకా కొంత నష్టపోవలసి వస్తుంది. తరువాతకూడా తిరిగి అమెరికాతో కయ్యంపెట్టుకొని సోషలిజం స్థాపించటానికి పూనుకోటంకష్టం. ఇంతమాత్రంచేత రష్యా తన ఆదర్శాన్ని చంపుకుంటుంది అని అనుకోకూడదు ఫాసిస్టు శక్తులకి పట్టుకొమ్మఅయిన మిలిటరీ శక్తిని నాశనం చేయటంలో ఫాసిజం మూలాధువంతులు నడుము విరిగినట్లే అయిపోతుంది. తిరిగి ఐరోపాఖండములో ఫాసిస్టు ప్రభుత్వాలు స్థాపించబడవు. పూర్తిగా సోషలిస్టు ప్రభుత్వాలు కాకపోయినా ప్రజాస్వామిక ప్రభుత్వాల స్థాపనజరుగుతుంది. ఈ ప్రభుత్వాలవల్ల తిరిగి ప్రజాస్వామిక శక్తులు విప్లవశక్తులు తలెత్తటానికి వీలవుతుంది. ఇలాజరగడం రష్యాఆదర్శంలో, సగం నెగ్గినట్లే. కాబట్టి వెంటనే అమెరికాతో చేయిచేసుకో కుండా రష్యా తిరిగి కొంతకాలం వేచియుంటుంది. ఇలా ఓర్పు వహించడం రష్యాకుకూడా మేలే.

ఇక ఇంగ్లాండుసంగతి ఆలోచిద్దాము. ఇంగ్లండు పూర్తిగా రష్యాను బలపరుస్తుందో, పూర్తిగాఅమెరికాను బలపరుస్తుందో లేక అటుయిటు కాకుండా తటస్థంగా వుంటుందో చెప్పటం కష్టం. యీ యుద్ధంతరువాత ఇంగ్లండు పూర్తిగా సోషలిస్టు దేశంగా మారే సూచనలు లేవు. కాని ఇప్పటి కంటె యెక్కువ ప్రజాస్వామికంవుండే ప్రభుత్వం రాకతప్పదు. ఇది జ్యోతిష్యం చెప్పటంకాదు. ఈ యుద్ధంవల్ల ఇంగ్లండులో జరుగుతున్న

మార్పులు గ్రహిస్తే నూతనవచ్చే ప్రభుత్వంకూడా యేదో వ్యూహించడం తేలిక. చర్చిలు, అమెరీలు బ్రిటిషుసామ్రాజ్యాన్ని రక్షించటానికి పూనుకున్నా ప్రపంచంలో జరిగే మార్పుల్ని అడ్డుకోలేరు. 1943-44 సంవత్సరాల్లోవున్న ప్రపంచాన్ని తిరిగి 1939 కి తీసుకొని వెళ్ళటానికి బ్రిటిషు కన్సర్వేటివుముఠాకి చేతగాదు. నేడు ఇండియాలో జరుగుతున్నట్లే ఇంగ్లండులో కూడ ప్రభుత్వంలో మార్పు వస్తున్నది. పార్లమెంటులో కన్సర్వేటీవుపార్టీకి మెజారిటీవున్నా కాబినెట్‌లో లేబరుపార్టీ (బ్రిటిషు ప్రజాస్వామికం) పలుకుబడి సంపాదించింది. ప్రజాశక్తులు అభివృద్ధిచెందుతున్నవి. పెట్టుబడిదార్లనుంచి లాభాల్లో నూటికి తొంభై వంతులు ఆదాయపుపన్ను ద్వారా ప్రభుత్వం గుంజుతుంది. ప్రస్తుతం ఇది యుద్ధఅవసరంగా కనపడవచ్చు. కాని యుద్ధంతరువాత తిరిగి పెట్టుబడిదార్లు నూటికి నూరుపాళ్ళు లాభాలు గడించాలంటే ప్రభుత్వం పూనుకున్నా ప్రజానీకం వూరుకోదు.

ఇది ఇలావుంచి బీవరిడ్జిస్కీము వొకవిధంగా బ్రిటిషుప్రజాస్వామిక విజయాన్ని సూచిస్తుందనీ చెప్పవచ్చును. ఈ స్కీము ప్రకారం ప్రతిసంవత్సరం ప్రభుత్వం దేశములోని సంస్కరణల కోసం 50 కోట్లపౌనులు వ్యయంచేయాలి. అంటే ప్రభుత్వాదాయం ప్రతిసంవత్సరం 50 కోట్ల పౌనులధనానికి తగ్గకూడదు. అదనపు మూలధనాన్ని (దేశంలోపెట్టుబడి పెట్టగా మిగిలినది) ఇతరదేశాల్లో పెట్టుబడి పెట్టడం ఆధునిక సామ్రాజ్యతత్వానికి పునాది. గతయుద్ధంవల్ల ఇంగ్లండు అదనపుమూలధనం చాల

వరకు తగ్గింది. 1922—23 సంవత్సరాల్లో ఇంగ్లండు ఇతర దేశాలకు యెగుమతి చేయగలిగిన మూలధనం 5 కోట్ల పౌన్లకంటె యెక్కువ లేదు. ఈ యుద్ధానంతరం యింకా తగ్గిపోయే అవకాశం వుంది. కాబట్టి బీవరిడ్జి స్కీము ఆచరణలోకివస్తే ఇంగ్లండులోని మూలధనం ఇంగ్లండు సంస్కరణలకే సరిపోతుంది. ఇతర దేశాలకు ఎగుమతి చేసే అవకాశం వుండదు. అంటే సామ్రాజ్యతత్వ పునాదే కదలిపోతుందన్న మాట. బీవరిడ్జి స్కీముని ప్రస్తుతప్రభుత్వం చాలవరకు అంగీకరించింది. అంతా వున్నది వున్నట్టుగా అంగీకరించాలని లేబరుపార్టీ పట్టుపడుతుంది. ఇప్పుడు కాకపోయినా యుద్ధానంతరంఅయినా స్కీముని అంగీకరించక తప్పదు. ఇంగ్లండులోని బీవరిడ్జి స్కీము మీద ప్రజాభిప్రాయం తీసుకుంటే కాదనేవాళ్ళు యే కొద్దిమందో వుంటారు. కనుక యుద్ధానంతరం బ్రిటిష్ సామ్రాజ్యం యిప్పటిలాగా వుంటుందని కాని ఇంగ్లండు ప్రభుత్వం సామ్రాజ్యప్రభుత్వంగానే వుంటుందని కాని అనుకోటం కల్ల.

కనుక ఇంగ్లండులో సోషలిస్టు ప్రభుత్వం రాకపోయినా యిప్పటి సామ్రాజ్య ప్రభుత్వం పోయి యెక్కువ ప్రజాస్వామికం వుండే ప్రభుత్వం యేర్పడడం తప్పనిసరి అవుతుంది. ఇది రష్యాకుకూడా శుభసూచకం. ఈ ఏర్పడబోయే ప్రభుత్వంతో రష్యా మైత్రిని అభివృద్ధి చేసుకోటం అవసరం. ఈ మార్పునంతా తెలుసుకోబట్టే రష్యా ఇంగ్లండుతో 20 సంవత్సరాల వరకూ మైత్రి సంధిని చేసుకుంది. లేకపోతే 20 సంవత్సరాల సంధిపత్రాన్ని రష్యా వొప్పుకోవటంలో అర్థంలేదు. అంత

వరకూ యుద్ధం సాగుతుందని రష్యా యీ సంధిపత్రంమీద సంతకం చేయలేదు. అమెరికా సామ్రాజ్యతత్వంనుంచి ఇంగ్లండును వేరుచేయటానికి రష్యా ఇంగ్లండుతో దృఢమైన సంబంధాన్ని కల్పించుకుంటుంది. ఇప్పటికే బ్రిటిషు సామ్రాజ్యంలో అమెరికా పలుకుబడి హెచ్చిపోయింది. ఆస్ట్రేలియా, కెనడా దేశాలు అమెరికా పక్కకు చేరుతున్నవి. పసిఫిక్ సముద్రంలో జపాను ఓడిపోగానే అమెరికా ఆధిపత్యం వహిస్తుంది. ఆఫ్రికాలో కాలుపెట్టి అక్కడ పలుకుబడికోసం ముందుకు సాగుతుంది.

కాబట్టి యుద్ధానంతరం ఇంగ్లండు వెనుకటిలాగా సామ్రాజ్య దేశంగా వుండదు. ఇంగ్లండు వొక ప్రజాప్రభుత్వ దేశం అవుతుంది. ఇది ఇంగ్లండు దేశానికి నష్టంకాదు. ఇంగ్లండు పెట్టుబడిదార్లకు యిది గొడ్డలిపెట్టు అయినా ఇంగ్లండు ప్రజాస్వామికానికిది శుభచిహ్నం. బ్రిటిషు ప్రజాస్వామికాన్ని అమెరికా క్రిందకు పోనీయకుండా రష్యా తనవైపుకు తిప్పుకోటం ఈ రెండు దేశాలకే కాదు, భావి ప్రపంచానికికూడా మేలే. కాబట్టి రష్యా బ్రిటనుల మైత్రిసంధివల్ల భావిప్రపంచ నిర్మాణానికి పునాది యేర్పడిందని చెప్పవచ్చును.

కాబట్టి అంతర్జాతీయంగా అక్షరాజ్యాలు వోడిపోవటం అంటే ఫాసిస్టు రాజ్యాల మిలిటరీశక్తి నాశనం అవుతుంది. కాని ఐరోపా ఖండంలోగాని జపానులోగాని వెంటనే సోషలిస్టు ప్రభుత్వాలు యేర్పడే పరిస్థితులు లేవు. అంటే ఫాసిస్టు మిలిటరీ శక్తి నాశనం అయినాకూడా ఫాసిస్టు తత్వంగాని, ఫాసిస్టు

సిద్ధాంతంగాని పూర్తిగా నాశనం అయ్యేవరకూ యీ యుద్ధం సాగదు. అమెరికా సామ్రాజ్య దేశంగా ప్రపంచాధిపత్యాన్ని వహించటానికి ప్రయత్నిస్తుంది. ఇంగ్లాండు సామ్రాజ్యవాద ఇంగ్లండునుంచి ప్రజాస్వామిక ఇంగ్లండుగా మారుతుంది.

అంతర్జాతీయ పరిస్థితు లిలా వున్నప్పుడు మరి ఇండియాస్థితి యేమిటి? అంతర్జాతీయంగా ఫాసిస్టు మిలిటరీశక్తి నాశనం అయినా ఫాసిస్టు సిద్ధాంతం నాశనం కాదు. కాబట్టి ఇండియాలో ఫాసిస్టు తత్వం ఈ యుద్ధంవల్ల నాశనంకాదు. రూజువెల్టుకాని, చర్చిలుకాని ఇండియాలో ఫాసిస్టుతత్వం నాశనం చేయటానికి యింకొక యుద్ధం సాగించరు. ప్రజాస్వామిక శక్తులు రష్యా సహాయం కోరవచ్చును. కాని రష్యా ఇంగ్లండును వత్తిడిచేసి ఇండియా స్వాతంత్ర్యంకోసం భావి ప్రపంచ నిర్మాణానికి పునాది అయిన బ్రిటను మైత్రిని భగ్నం చేసుకోదు. అసలు యిట్టి పరిస్థితుల్లో యిచ్చటి ప్రజాశక్తులు రష్యాను వత్తిడిచేసి అమెరికాతో కయ్యానికి దించటం, బ్రిటను మైత్రిని చెడగొట్టడం భావ్యం కాదు. ఒకవేళ యీ పరిస్థితుల్లో ఇండియాకు స్వాతంత్ర్యం లభించినా దేశీయ పెట్టుబడిదార్లు అమెరికా సహాయంతో ఇండియాలో కాపిటలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నం చేస్తారు. ఇప్పటికే యీ ప్రమాదం కనబడుతుంది. బ్రిటను సామ్రాజ్యతత్వాన్ని కోల్పోయి, ప్రజాస్వామిక శక్తిగా మారుతున్నకొద్దీ ఇండియాలోని జాతీయవాదులు బ్రిటనుతో వున్న సంబంధాన్ని తెంచుకుంటున్నారు. అమెరికా క్రిందకు చేరుతున్నారు. దేశీయ పెట్టుబడిదార్లకు

దేశీయ ప్రజాస్వామికం అన్నా, బ్రిటిషు ప్రజాస్వామికం అన్నా గిట్టదు. పెట్టుబడిదారీవర్గానికి పెట్టుబడిదారీవర్గంతోనే పొత్తు కుదురుతుంది. కాబట్టి పెట్టుబడిదార్ల ప్రభుత్వంగా వుండే అమెరికాతో చేతులు కలుపుతున్నారు. అమెరికాకూడా ఇండియాని తన క్రిందకు తీసుకోటానికి తగిన వాతావరణం యేర్పరుచుకుంటుంది. యుద్ధంకాగానే ఇండియాలో స్వాతంత్ర్యం అనే పేరుతో దేశీయ పెట్టుబడిదార్లకు అధికారం యిచ్చి తనక్రింద అట్టిపెట్టుకుంటుంది.

కనుక యీ యుద్ధంకాగానే వెంటనే ఇండియా సమస్య పరిష్కారం అవుతుందనుకోటానికి వీల్లేదు. ఇండియాసమస్య పరిష్కారం కావటం అంటే ఇండియాకిచ్చిన స్వయంనిర్ణయ హక్కు ఇచ్చటి ప్రజానీకానికి చెందాలి. కాని దేశీయ పెట్టుబడిదార్లు యీ హక్కు ప్రజానీకానికి చెందకుండా తామే భుక్తంచేసుకుని జాతీయతత్వంపేరిట ఫాసిస్టుప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నిస్తున్నారు. ఇండియాలో ఫాసిస్టు ప్రభుత్వంవస్తే మరో అంతర్జాతీయ యుద్ధం తప్పదు. క్రిందటియుద్ధానంతరం కాపిటలిస్టువర్గాల కుతంత్రాలవల్ల జర్మనీలో యేర్పడ్డ ఫాసిస్టుప్రభుత్వం యీ యుద్ధాన్ని లేవదీసింది. తిరిగి ఇండియాలో ఇదే జరిగితే మరో యుద్ధం తప్పదు. కనుక భావి భారతదేశసమస్య వొక్క భారతదేశానికేకాదు— ప్రపంచానికంతా సంబంధించింది.

ఇవి జాతీయ అంతర్జాతీయపరిస్థితులు. ఫాసిస్టుతత్వాన్ని నాశనంచేసే నేటి యీ యుద్ధం ఫాసిస్టు వ్యతిరేకయుద్ధం

అనిపించుకోదు. కాని యీ యుద్ధంవల్ల ఫాసిస్టుతత్వంపూర్తిగా నాశనం అయ్యేటట్లు కనుపించదు. కనుక అంతర్జాతీయంగా యీ యుద్ధం ఆగిపోయినా ఫాసిస్టుతత్వం వున్న వివిధదేశాల్లో యీ యుద్ధం మరోరూపంలో సాగుతుంది. ఫాసిస్టుతత్వంవున్న దేశాల్లో యిది అంతర్యుద్ధంగా మారుతుంది. ప్రజాస్వామిక శక్తులు కోరవలసిందికూడా యిదే. ఫాసిస్టుతత్వం అనేదివుంటే ఎప్పటికైనా తలెత్తి తిరిగి మిలిటరీబలాన్ని స్థాపించటానికి పూనుకుంటుంది. కనుక పునాదినే పెకలించివేయటం ప్రజాస్వామిక శక్తులు చేయవలసిన విధి.

ఇండియాలోకూడ ఫాసిస్టుతత్వం వుందికాబట్టి యీ యుద్ధాన్నే అంతర్యుద్ధంగా ఇండియాలో సాగించటం ఇచ్చటి ప్రజాస్వామికశక్తుల కర్తవ్యం. అంతర్జాతీయంగా ఇండియాలోని ప్రజాస్వామికశక్తులూ ఫాసిస్టుతత్వాన్ని నాశనంచేసే పరిస్థితుల్లో లేవు. కనుక అంతర్యుద్ధంద్వారా దేశీయఫాసిజాన్నైనా యెదుర్కోటం ముఖ్యం. ప్రజాస్వామికశక్తుల్ని యిందుకు ఆయత్తం కాకుండా చేయటానికి, ముందెప్పుడో ప్రజానీకం యెదురు తిరుగుతుందనే భయంతో రష్యామీద జర్మనీ పడ్డట్టుగా దేశీయ పెట్టుబడిదారీవర్గం జాతీయవుద్యమం పేరుతో ప్రజాస్వామిక శక్తులకు ప్రతిగా తామే అంతర్యుద్ధాన్ని లేవదీశారు. 1942 అగస్టులో కాంగ్రెసు ప్రారంభించిన వుద్యమం మొదటిరంగం. ఆహారపదార్థాలు ప్రజానీకానికి అందకుండా చేయటం రెండో రంగం, గాంధీ నిరసనవ్రతం మూడోది. దేశీయపెట్టుబడిదార్లు యీ అంతర్యుద్ధాన్ని ప్రజాస్వామికశక్తుల్ని, విప్లవాన్ని నాశ

నం చేయటానికి ప్రారంభించారు. కనుక ఇండియాలో అంత ర్యుద్ధం యిదివరకే ప్రారంభం అయింది. కొత్తగా ప్రజాస్వామిక శక్తులు అంతర్యుద్ధాన్ని లేవదీయ నక్కర్లేదు. జరిగే యుద్ధంలో తమపక్షం గెలిచేట్లు యుద్ధాన్ని సాగించటం ప్రజాస్వామిక శక్తుల బాధ్యత.

## 8. అమెరికా యెత్తులు

అమెరికా ప్రపంచాధిపత్యంకోసం యెదురుచూస్తుందని చెప్పాము. ఇండియాని యుద్ధానంతరం తనక్రిందకు లాక్కోవాలని చూస్తుందని అందుకు తగిన వాతావరణం యిక్కడ సృష్టించుకుంటుందని కూడా చెప్పాము. ఇది చాలామందికి ఆశ్చర్యంగా కనబడవచ్చు, కాని యథార్థపరిస్థితులు ఆలోచిస్తే యిందుకు అనుకూల సమాధానమే వస్తుంది. అమెరికా యీ యుద్ధంవల్ల నష్టపడింది అట్టే లేదని పైగా వుత్పత్తిని యెక్కువ చేసి కాపిటలిస్టు విధానాన్ని అభివృద్ధి చేస్తుందని అందరు వొప్పుకోవలసిన విషయమే.

సామ్రాజ్యతత్వం కాపిటలిస్టు విధానంలో చివరి అంతస్థు. ఇదివరకే అమెరికా, సామ్రాజ్య దేశంగా వుంది. ఈ యుద్ధం వల్ల యీ తత్వం బాగా బలపడింది. (ఇంగ్లండు యిలా యెందుకు కాలేకపోయిందో వెనుక చర్చించాము) కనుక సామ్రాజ్యతత్వం గల దేశం మార్కెట్లకోసం ప్రపంచాధిపత్యాన్ని కోరటం, అందుకు ప్రయత్నించటం సహజమే. ప్రపంచాధిపత్యమే కావాలనుకునే అమెరికా, ఇండియాని తన క్రిందకు

లాక్కోవాలనుకోటంలో సందేహం వుండదు. కాని యిలా నిర్మొహమాటంగా ప్రపంచాధిపత్యం కావాలంటే కుదరదు. యే దేశాలూ అంగీకరించవు. కనుక వీలైన దేశాల్లో వీలైనట్లుగా పెట్టుబడి సంపాదించుకొని స్థావరం యేర్పరచుకోటం సామ్రాజ్యదేశాల మొదటి యెత్తు.

ఇండియా పరిస్థితులు యిందుకు అనుకూలంగా వున్నవి. దేశీయ పెట్టుబడిదార్లు అధికారంకోసం వువ్విళ్ళూరుతున్నారు. బ్రిటను వుత్తుత్త మాటలతో అధికారం యిచ్చేటట్లు లేదు. పైగా బ్రిటను యుద్ధానంతరం ప్రజాస్వామికరాజ్యం కాబోతూ వుంది. ప్రజాస్వామిక బ్రిటను దేశీయపెట్టుబడిదార్లకు అధికారం యిచ్చి ఇండియాలో కాపిటలిస్టు ప్రభుత్వం స్థాపిస్తుందనుకోటం అసంభవం. కనుక దేశీయ పెట్టుబడిదార్లకు బ్రిటనుతో సంబంధం పెట్టుకున్నా-ర్చంటే కుదరదు. రష్యాకు వర్గం అంటే అసలే గిట్టదు. మిగిలేది అమెరికా. వీరి మన స్తత్వానికీ, అమెరికా తత్వానికీ చుట్టరికం కుదురుతుంది కాబట్టి అమెరికా అంటే వీరికి యెక్కడలేని ఆప్యాయం కలుగుతుంది.

అమెరికా యీ ఆసరాచూచుకుని ఇండియాఅంటే అంతులేని ప్రేమ, అభిమానం చూపుతుంది. వెండల్‌విల్కీ లూయీ ఫిషర్, ఎడ్‌గార్‌స్నో, మొదలైన అమెరికా ప్రముఖులు "ఇండియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలి", ఇండియాలో జాతీయ ప్రభుత్వం స్థాపించాలి" అని గొంతెత్తి అరుస్తున్నారు. విల్కీ రిపబ్లికనుపార్టీ నాయకుడు—పెట్టుబడిదారివర్గానికి చెందినవాడు. లూయీఫిషర్, ఎడ్‌గార్‌స్నో జాతీయవాదులు. వీరికి ఇండియా

అంటే యింత అభిమానం, ప్రేమ యెందుకూ ? పెట్టుబడి దారుడు, పెట్టుబడిదారివర్గాన్ని, జాతీయవాది, జాతీయవాదుల్ని కాపులించుకోటం సహజం. కనుక వీరుచేసే ప్రచారం ఇండియాలో పెట్టుబడిదారివర్గానికీ, జాతీయతత్వానికీ చెందిన కాంగ్రెసుకు అధికారం యివ్వమని వీరు ఇండియాకి యివ్వమని కోరే స్వాతంత్ర్యం ఫలానా స్వాతంత్ర్యం అనికానీ, ప్రభుత్వం ఫలానాదనికానీ స్పష్టంగా లేదు. ప్రజాప్రభుత్వం అని చెప్పినా కొంత అర్థంవుండేది. వీరు అలా చెప్పకుండా, అంతరార్థంతో ప్రచారం సాగిస్తున్నారు. ఇండియా ప్రజలకు బ్రిటనంటే ద్వేషం, అమెరికాఅంటే అభిమానం కలిగించటం వీరివుద్దేశం.

దీనికి తగ్గట్టుగా అమెరికా, ఇండియాలో ప్రచారంకోసం విపరీతధనాన్ని ఖర్చుపెట్టుతూవుంది. దేశీయపత్రికల్లో, తాటికాయలంత అక్షరాలతో అమెరికాచేసే అడ్వర్టైజుమెంటు అంతులేకుండావుంది.

'1492–1942–నాలుగున్నర శతాబ్దాలనుంచి, కొలంబసు అమెరికా చేరినప్పటినుంచీ- ముఖ్యంగా వందన్నర సంవత్సరాలనుంచీ – అమెరికా అనుభవించే స్వేచ్ఛకు అంతులేదు ... విశ్వమానవ కళ్యాణం అమెరికా ముఖ్యోద్దేశం ... ... మానవ స్వేచ్ఛకోసమే అమెరికా యీ యుద్ధంలో దిగింది ... ... అమెరికాసేనలు ఇండియాలో వున్నది కేవలం ఇండియా స్వాతంత్ర్యాన్ని రక్షించటానికి." ఇదీ మన దేశంలో అమెరికాతరఫున జరిగే ప్రచారం. సామ్రాజ్యతత్వానికీ, మానవస్వేచ్ఛకూ పొత్తులేదు. సామ్రాజ్యతత్వం వున్నచోట మానవస్వేచ్ఛ

వుండదు. మానవస్వేచ్ఛవుంటే సామ్రాజ్యతత్వానికి ఆస్కారం లేదు. కాబట్టి అమెరికా మనదేశంఅంటే ఇంతవరకూలేని అభిమానాన్ని, ఇప్పుడు కనబరుస్తుందంటే (ఈ నాలుగున్నర శతాబ్దాల్లో అమెరికా యెప్పుడూకూడా మనదేశంఅంటే శ్రద్ధ చూపలేదు.) ఇందులో కొంత అంతరార్థం లేకపోదు. ఇది ఎరను చూపి చేపనుపట్టటం. ఈపరిస్థితు లిలావుంచి అమెరికా ప్రముఖులు ఇప్పుడు యెక్కువగా ఇండియావచ్చి, యిచ్చటి పరిస్థితులు స్వంతంగా, వ్యక్తిగతంగా తెలుసుకొని పోవటం జరుగుతుంది.

సామ్రాజ్యదేశం కాబట్టి అమెరికా యీపన్నాగం అంతా పన్నటం సహజమే. కాని అధికారంకోసం ప్రాకులాడుతున్న దేశీయ పెట్టుబడిదారీవర్గం, ఇంతవరకూ అధికారంకోసం బ్రిటనుతో పోట్లాడే దేశీయ పెట్టుబడిదారీవర్గం, తిరిగి అమెరికా క్రింద దాస్యాన్ని యెలా అపేక్షిస్తుందని సందేహించవచ్చు. అమెరికా వచ్చినా దాస్యంలో వుండేది ఇండియాలోని ప్రజానీకం కాని పెట్టుబడిదారీవర్గంకాదు. కాగా యీవర్గానికి యిదే తత్వంగల మరోవర్గం ఆశ్రయం యిస్తుంది. కాబట్టి అమెరికా వల్ల దేశీయ పెట్టుబడిదార్లు నష్టపడేది ఉండదు. వీరి లాభాలు వీరు నిరాటంకంగా సంపాదించటానికి వీలుంటుంది. జర్మనీ క్రిందకు ఫ్రాన్సు పోయినందువల్ల నష్టపడింది అచ్చటి ప్రజానీకం. అచ్చటి కాపిటలిస్టులు వెనుకటిలాగానే లాభాలు సంపాదించారు. ఇండియాకూడా అంతే. దేశీయ పెట్టుబడిదార్లకు అధికారం రావటం ప్రధానం. అమెరికా ద్వారా యిది సాధ్యపడేటప్పుడు

అమెరికా సహాయం కోరటం సహజం. అధికారం వచ్చినతరు వాత వీలుంటే అమెరికాను ఎదిరించి తామొక్కరే ఇండి యాలో ఏకఛత్రాధిపత్యాన్ని వహించి దోపిడీవిధానం సాగిం చటానికి చూస్తారు. వీల్లేకపోతే యిద్దరూ కలిసి యీపని నిర్వ హిస్తూవుంటారు. తేడా అంతే. దారిద్ర్యాన్ని అనుభవించేది అప్పుడూ ప్రజానీకమే, ఇప్పుడూ ప్రజానీకమే.

ఇలాకాకుండా దేశీయ పెట్టుబడిదారీవర్గం ప్రజాప్రభుత్వాని కొప్పుకుంటే తమ అస్తిత్వానికే భంగం వాటిల్లుతుంది. పరి శ్రమలు తమ చేతుల్లో వుండవు. వున్నా తమ యిష్టం వచ్చి నట్లు లాభాలు గడించటానికి వీల్లేదు. కనుక స్వీత్ర తే దేశీయ పెట్టుబడిదారీవర్గం వొక్కటే దేశంలో కాపిటలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నిస్తుంది. వీల్లేకపోతే అమెరికా సహా యంతో యీపని సాధిస్తారు.

## 9. కొత్తపంథా

ఇంతవరకూ జాతీయాతత్వం పేరిట ఇండియాలో జరిగే మో సాన్నిగూర్చి చర్చించాము. జాతీయశక్తులు జాతీయవాదం పేరుతో ఇండియాలో ఫాసిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నిస్తున్నవని కూడా తెలుసుకున్నాము. పరిస్థితులిలా వుంటే విప్లవం యెలా నెగ్గుతుందో మనం ఆలోచించాలి. విప్ల వం నెగ్గటం అంటే ఇండియాలో ప్రజాస్వామిక శక్తులు జయిం చాలి. జాతీయశక్తులు నశించాలి. ప్రభుత్వాధికారం ప్రజా స్వామికశక్తుల చేతుల్లోకి రావాలి. ఇది యెలాసాగుతుంది?

ఆధునిక పరిస్థితుల్లో విప్లవం వెనుకటిలాగే తేలిగ్గా జరుగుతుందనుకోటంగానీ, ప్రభుత్వాన్ని తేలిగ్గా ప్రజాశక్తులు వశం చేసుకోవచ్చుననుగానీ అనుకోటం పొరపాటు. ఇప్పటి ప్రభుత్వాలు వెనుకటి ప్రభుత్వాల్లాగా బలహీనంగా లేవు. ప్రభుత్వానికున్న ఆధునిక యుద్ధసాధనాలతో పోల్చిచూస్తే వెనుకటి ప్రభుత్వాలకున్న బలం చాలా తక్కువ. 1917 లో రష్యాలోని విప్లవపార్టీ మాస్కో, పెట్రొగ్రాడ్ పట్టణాలు పట్టుకోవటంతో జారుప్రభుత్వం విచ్ఛిన్నం అయిపోయింది. 1789 లో ఫ్రాన్సులోని విప్లవశక్తులు ప్రభుత్వజైలుని బద్దలుచేయటంతో వున్న ప్రభుత్వం లొంగిపోయింది. విప్లవం నెగ్గింది. నేడు ఇండియాలోకూడ యిలాచేస్తే విప్లవం జయిస్తుందనుకోవటం పొరపాటు. వైప్రాయిభవనం వశం చేసుకున్నంతమాత్రంచేత, లేక కొన్ని పట్టణాలు పట్టుకున్నమాత్రాన విప్లవం నెగ్గినట్లు భావించ కూడదు. ప్రభుత్వం యింతమాత్రానికే లొంగదు. బాంబులవర్షం కురిపించి విప్లవ శక్తుల్ని ధ్వంసంచేస్తుంది. దీనికి వుదాహారణం యిప్పుడు కాంగ్రెసు తలపెట్టిన విధ్వంసక వుద్యమాన్ని ప్రభుత్వం నాశనం చేయటమే. "కాంగ్రెసు ప్రజల్లో చైతన్యం కలిగించలేదు. ప్రజల్లో రాజకీయ విజ్ఞానం, చైతన్యం వుంటే ప్రభుత్వాన్ని యెదిరించి రాజకీయాధికారం చేపట్టం తేలికని" కొంతమంది వుద్దేశపడవచ్చు. కాని యిట్టి పరిస్థితుల్లోకూడ ఆధునిక మారణయంత్రాలముందు ప్రజాబలం నిలుస్తుందని చెప్పటం కష్టం. అయితే మరి ప్రజాస్వామికశక్తులు ప్రభుత్వాన్ని ఎలా వశం చేసుకుంటవి? ఇండియాలో విప్లవం యెలా నెగ్గు

తుంది?

ఈ యుద్ధం రానంతవరకు ఇండియాలో ప్రభుత్వాన్ని యెది రించటమే ప్రధాన సమస్యగా వుంది. ఈ యుద్ధంవల్ల యీ మూడు నాలుగు సంవత్సరాల్లో జాతీయ అంతర్జాతీయంగా అనుకోని మార్పులెన్నో జరిగినవి. ప్రపంచంలోని వివిధశక్తుల మధ్య కొత్తసంబంధాలు యేర్పడ్డవి. శత్రువులు మిత్రులూ, మిత్రులు శత్రువులూ అయ్యారు. ఫాసిస్టు దేశాలన్నీ వొకటి అయ్యాయి. ఫాసిస్టు వ్యతిరేక దేశాలు వొకటి అయ్యాయి. సోషలిస్టు రష్యాకు, కాపిటలిస్టు ఇంగ్లండుకు మైత్రి యేర్పడింది.

ఇండియాలో కూడ యీమార్పులు జరగటంచేత యిక్కడ కూడ కొత్త సంబంధాలు యేర్పడ్డవి. ప్రభుత్వం, ప్రజాస్వామిక శక్తులు ఒకటేమార్గంలో నడచినవి. (ఈయుద్ధం ఫాసిస్టు వ్యతిరేకయుద్ధం కావటంచేత యీ యుద్ధంలో పాల్గొన్న ప్రభుత్వాన్ని యెదిరించటం ఫాసిస్టు రాజ్యాలకే అనుకూలం. ఇలా చేస్తే ప్రజాస్వామికానికే ముప్పు కలుగుతుంది. కనుక నిజమైన ప్రజాస్వామిక శక్తుల కర్తవ్యం ఫాసిజానికి వ్యతిరేకంగా పోట్లాడే ప్రభుత్వాన్ని బలపరచటం.) జాతీయతత్వంలోవున్న కాంగ్రెసు యీపని చేయదు. పైగా జాతీయతత్వం అయిన ఫాసిజాన్నే బలపరుస్తుంది ఇది దీనికి సహజమే. యుద్ధం రానంతవరకూ కాంగ్రెసులో జాతీయతత్వం (ఫాసిస్టుతత్వం) నివురు గప్పిన నిప్పులాలె అణగివుంది. యుద్ధం రాగానే యిది బయట పడింది. విధ్వంస చర్యల ద్వారా కాంగ్రెసు వుద్యమాన్ని లేవదీసి ప్రభు

త్వాన్ని యెదిరించింది. ఇది ఫాసిస్టు రాజ్యాలకు సహాయం చేయటం.

ఇప్పుడు యుద్ధంలో ఫాసిస్టు రాజ్యాలు గెలుస్తవనే భయం లేదు. ఈ భయంవున్నంతకాలం ప్రజాస్వామిక శక్తులు ప్రభుత్వానికి సహాయంచేయటంలో తప్పు లేదు. ఇప్పుడు భయం తీరిపోయింది. కాబట్టి ప్రజాస్వామిక శక్తులు తిరిగి అధికారం వశం చేసుకోటానికి ప్రభుత్వంతో యెందుకు పోరాటానికి దిగకూడదనే ప్రశ్న వస్తుంది. కాని యిప్పుడు దేశంలో కొత్త పరిస్థితులు యేర్పడటంచేత విప్లవకార్యక్రమం కూడా కొత్త పంథాలో నడవాలి. ఇప్పుడు దేశంలో జాతీయశక్తులు విజృంభిస్తున్నవి. ఫాసిజాన్ని యెదిరించే ప్రజాస్వామిక శక్తులు జాతీయ శక్తుల్నికూడ యెదిరించి నాశనం చేయాలి. ఫాసిస్టు వ్యతిరేక వాది జాతీయతత్వ వ్యతిరేక వాది కావాలి. ఇప్పుడు నిజమైన ప్రజాస్వామ్య వాదులు చేయవలసిన పని యిది.

నేను ఇండియాలో కాంగ్రెసు, కాంగ్రెసుతోబాటు ఇంచుమించుగా హిందూ మహాసభ, ముస్లింలీగు, నాన్-పార్టీ నాయకవర్గం మొదలైన పార్టీలన్నీ జాతీయ తత్వాన్నే బోధిస్తున్నవి. కనుక ప్రజాస్వామ్యవాదులు వొక వంక జాతీయ వాదులతోనూ, మరోప్రక్క ప్రభుత్వంతోనూ వొకేసారి పోరాటం సాగించి నెగ్గటం కష్టం. అలాకాకుండా ముందు ఒక్క ప్రభుత్వంతో పోరాటం సాగిస్తే పరిస్థితులు మరీ తలక్రిందులు కావటానికి వీలుంటుంది. ఇంతవరకూ ప్రభుత్వం సామ్రాజ్యవాద యేజంటుగా వుంటంచేత పరిస్థితుల్నిబట్టి ప్రభు

త్వంలో కొంత మార్పువచ్చినా వస్తుతా వున్న ప్రభుత్వాన్ని కొంతవరకు విప్లవవ్యతిరేక శక్తిగానే పరిగణించవచ్చును. కనుక జాతీయవాదుల్ని యెదిరించకుండా ప్రభుత్వంతోనే పోరాటం సాగిస్తూవుంటే ఇటు జాతీయశక్తులు మరీ విజృంభించటానికి, అటు ప్రభుత్వం వీటితో చేతులు కలపటానికీ వీలుంటుంది. అలా జరిగితే ఇండియా పరిస్థితులు మరీ అధ్వాన్నంగా వుంటై. ప్రభుత్వం జాతీయవాదులందరికి చేరితే ఇండియాలో ఫాసిస్టు ప్రభుత్వం యేర్పడినట్లే. ప్రజానీకం తిరిగి కొన్ని వందల సంవత్సరాలవరకూ బానిసత్వంలో, దారిద్ర్యంలో వుండవలసివస్తుంది.

కాబట్టిఇండియానియీప్రమాదంనుంచితప్పించాలంటే ప్రజాసామ్యవాదులు చేయవలసిన కర్తవ్యం జాతీయవాదులతోనే పోరాటం సాగించాలి. ప్రభుత్వానికీ, వీరికీ సంబంధం లేకుండా చేయాలి. ఇది చేయాలంటే జాతీయవాదుల్ని ప్రభుత్వం దగ్గరకు చేరకుండా చేయాలి ప్రభుత్వంతో తామే యెక్కువ సంబంధం పెట్టుకొని జాతీయవాదుల్ని ప్రభుత్వంనుంచి దూరం చేయాలి. అంటే నేడు ఇండియాలో ప్రజాసామ్యవాదులు చేయవలసిన పని ఒక ప్రక్క ప్రభుత్వంతో సంబంధం పెట్టుకోటం, మరోప్రక్క జాతీయవాదులతో పోరాటం సాగించి జాతీయ తత్వాన్ని నాశనం చేయటం.

ఇలా చెప్పినందువల్ల ఇండియాలో జరుగవలసిన విప్లవం తలక్రిందు లౌతుందనుకోకూడదు. "దేశంలోని ప్రజాసామ్యవాదులకూ, జాతీయవాదులకూ పోరాటం జరుగుతుంటే ప్రభుత్వం గప్‌చిప్పుగా చూస్తూవుంటుంది. ఇటు ప్రజాస్వామ్య

శక్తులూ, అటు జాతీయశక్తులూ నాశనం అవుతుంటే ప్రభుత్వం అలాగే వుంటుంది. ఒకవేళ జాతీయవాదులు వోడిపోయి ప్రజాస్వామ్యవాదులు గెలిచినా అంతవరకూ ప్రభుత్వం క్రింద చేరిన వీరిని ప్రభుత్వం నెత్తిమీద మొట్టటం మరీతేలిక. కనుక యీ పంథాలో నడిస్తే ఇండియాలో విప్లవం అనలే నెగ్గదని" అనుకోటం తెలివితక్కువ. ఇండియాలో విప్లవం నెగ్గాలంటే యిప్పటి పరిస్థితులబట్టి యింతకంటె మరో సులభమైన మార్గం లేదు. ప్రజాస్వామ్యవాదులు ఈమార్గంలో నడిస్తేనే యిండియాలో విప్లవం నెగ్గుతుంది. ప్రజాప్రభుత్వం స్థాపించటానికి వీలౌతుంది జాతీయశక్తుల్ని నాశనం చేయటంవల్ల దేశంలో ఫాసిస్టుతత్వం నాశనం అవుతుంది. అయితే మరి వున్న ప్రభుత్వంతో సంబంధం పెట్టుకున్నారుట్టుంటే ఆప్రభుత్వం ప్రజాప్రభుత్వంగా యెలామారుతుందో విచారిద్దాము.

ఇండియాప్రభుత్వంలో మార్పువస్తుందని వెనుక చెప్పాము. ఆర్థికపెత్తనం బ్రిటిషు వర్తకుల చేతుల్లోనుంచి దేశీయవర్తకుల చేతుల్లోకి రావటంచేత, ఇండియా వలసరాజ్యంనుంచి జాతీయ రాజ్యంగా మారుతుందని తెలుసుకున్నాము. ఇండియాప్రభుత్వంకూడా సామ్రాజ్యతత్వలక్షణాలు కోల్పోతుందని చెప్పాము. కనుక ఇండియాప్రభుత్వం వొక అవస్థనుంచి మరోఅవస్థకు మారేస్థితిలో వుంది. ఇండియాలో విప్లవం పాంతంగా నెగ్గటం అంటే ఇండియాప్రభుత్వం పూర్తిగా ప్రజాప్రభుత్వం కావటం. కనుక యిప్పుడు మారకంలోనున్న ప్రభుత్వం పూర్తిగా మారేటట్లు చేయాలి.

బ్రిటిషు ప్రభుత్వాన్ని బట్టి ఇండియాప్రభుత్వం వుంటుంది. బ్రిటిషుప్రభుత్వం సామ్రాజ్యప్రభుత్వంగా వున్నంతకాలం ఇండియాప్రభుత్వం దానికి యేజంటుగా పనిచేసింది. బ్రిటిషుప్రభుత్వంలో సామ్రాజ్యతత్వలక్షణాలుపోయి ప్రజాస్వామిక లక్షణాలు ఏర్పడుతున్నై. ఇండియాప్రభుత్వంలో కూడ యీమార్పులు రాకతప్పవు. ఇదివరకే యీ మార్పులు కనపడుతున్నై. యుద్ధానంతరం ఇంగ్లండులో పూర్తిగా ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడితే ఇండియాప్రభుత్వంలోకూడ దాని ఫలితం కనబడక తప్పదు.

ఇది యిలావుంచి యుద్ధానంతరంకూడా బ్రిటిషుప్రభుత్వానికీ, ఇండియా ప్రభుత్వానికి యిప్పటి సంబంధమే, వొకదాని కిందవొకటి యేజంటుగా వుంటుందనుకోటం పొరపాటు. సామ్రాజ్యప్రభుత్వంలోకంటె, ప్రజాస్వామిక ప్రభుత్వంలో ప్రజల కొనుగోలుశక్తి యెక్కువ అవుతుంది. ప్రజానీకానికి జీవిత అవసరాలు తగ్గించుకోవాలనే నిర్బంధం వుండదు. సామ్రాజ్య ప్రభుత్వంలో ప్రజల ఆదాయం తక్కువ కాబట్టి దాని ననుసరించి జీవిత అవసరాలు వుంటవి. ప్రజాస్వామిక ప్రభుత్వంలో ఆదాయం హెచ్చుతుంది కాబట్టి దీన్నిబట్టి జీవితవ్యయపరిమాణంకూడ హెచ్చుతుంది. కనుక యుద్ధానంతరం బ్రిటనులో యేర్పడే ప్రభుత్వం అచ్చటి ప్రజలమేలుకోసమే పాటుబడుతుంది. ప్రజల కొనుగోలుశక్తి తగ్గకుండాచేయాలంటే, అచ్చటి బ్రిటిషు కర్మాగారాలు యిప్పటిలాగానే పనిచేస్తూ వుత్పత్తిని యెక్కువచేయాలి. అవసరమైతే ఇంకా యెక్కువ కర్మా

గారాలు స్థాపించాలి. కాని వీటికి కావలసిన ముడిసరుకుల కోసం యెక్కువగా ఇంగ్లండు యితర దేశాలమీద ఆధార పడివుండాలి. బొగ్గు, యినుము కొంతవరకు యింగ్లండులో దొరికినా పత్తి మొదలైన వాటిని ఇంగ్లండు యితర దేశాల నుంచే తెప్పించుకోవాలి. పైగా ఆహారపదార్థాల్ని కూడా ఇంగ్లండు ఇతరదేశాలనుంచే తెప్పించుకోవాలి. కనుక ఇంగ్లండు తాను వుత్పత్తిచేసిన సరుకుల్ని యెగుమతిచేయటానికి తనకు కావలసిన ముడిసరుకుల్ని, ఆహారపదార్థాల్ని దిగుమతిచేయ టానికి యితర దేశాలతో సంబంధం పెట్టుకోవాలి. ఈ సంబంధం వెనుకటిలాగా సామ్రాజ్యప్రభుత్వానికీ, వలస రాజ్యాలకూ వుండే సంబంధంలాగా వుండదు. సమాన స్వాతంత్ర్య దేశాల మధ్య వుండే సంబంధంగా వుంటుంది. కారణం బ్రిటను సామ్రాజ్య దేశంగా లేనప్పుడు వలసరాజ్యం అనేది వుండదు. కనుక యిప్పుడు బ్రిటనుక్రింద వలసరాజ్యాలుగా పరిగణింప బడే దేశాలతో యుద్ధానంతరం బ్రిటను క్రొత్తసంబంధాన్ని పెట్టుకుంటుంది. ఇలా చేయకపోతే యిప్పుడు బ్రిటనుతో సంబంధంవున్న దేశాలన్నీ తమ సంబంధాన్ని తెంచుకుంటవి. అప్పుడు బ్రిటిషు ప్రజాస్వామికానికే ముప్పు గలుగుతుంది. కనుక బ్రిటనుకు అంతకంటె గత్యంతరంలేదు.

పరిస్థితు లిలావున్నప్పుడు యుద్ధానంతరం ఇంగ్లండు, యిండి యాతో కొత్త సంబంధాలు యేర్పరచుకోవాలి. ఇంగ్లండు వుత్పత్తిచేసిన సరుకుల్ని యిచ్చటి ముడి పదార్థాలకు, ఆహార పదార్థాలకు మార్చుకోవాలి. ఇండియాలో కాపిటలిస్టు

ప్రభుత్వం వస్తే, తనకు గిట్టుబాటుకాదనుకుంటే, లాభాలకోసం బ్రిటనుతో సంబంధం తెంచుకుని మరో దేశంలో సంబంధం పెట్టుకోవచ్చు. ఇండియాలో ప్రజాస్వామిక ప్రభుత్వం వస్తే యీ ప్రమాదం వుండదు. కనుక బ్రిటిషు ప్రజాస్వామికం దీన్నే బలపరుస్తుంది. కాబట్టి యుద్ధానంతరం ఇంగ్లండులో యేర్పడే ప్రభుత్వాన్నిబట్టి ఇండియా భవిష్యత్తు కూడా ఆధారపడి వుంటుంది.

ఈ మధ్యలో బ్రిటను పెట్టుబడిదారీవర్గం కుతంత్రం చేయ వచ్చు. బ్రిటిషు పెట్టుబడిదారీవర్గానికి తమ దేశంలో ఆస్కారం లేకపోవటంచేత ఇండియాని ఆశ్రయించవచ్చు. ఇండియాలోని జాతీయవాదుల్ని రేకొల్పి ఇండియాకిచ్చిన స్వయం నిర్ణయ హక్కు వీరికే చెందేటట్లు ప్రయత్నించవచ్చు. అట్టి పరిస్థితుల్లో ఇంగ్లండులో ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడ్డా ఇండియాలో కాపిటలిస్టు ప్రభుత్వం యేర్పడటం, ప్రజానీకం బానిసత్వంలో వుంటం తప్పదు.

ఈ ప్రమాదం రాకుండా చేయటానికి, ఇండియాలో ప్రజాస్వామిక ప్రభుత్వంయేర్పడటానికి, అంటే ఇండియాకిచ్చిన స్వయంనిర్ణయహక్కు ప్రజలకుచెందేటట్లు చేయటానికి యిప్పటి నుంచీ ఇండియన్ ప్రజాస్వామ్యశక్తులు బ్రిటిషు ప్రజాస్వామికంతో యెక్కువ సంబంధాన్ని యేర్పరచుకోవాలి. జాతీయ ప్రభుత్వంపేర, స్వాతంత్ర్యంపేర జాతీయవాదులుచేసే కుతంత్రం బ్రిటిషు ప్రజాస్వామికానికి తెలియజేయాలి. బ్రిటిషు ప్రజాస్వామికంతో సంబంధం యేర్పరచుకోవాలంటే ఇండియా

ప్రభుత్వం ద్వారానే యిది సాధ్యపడుతుంది. బ్రిటిషు ప్రజా స్వామికానికీ, ఇండియన్ ప్రజాస్వామికానికీ మధ్య నున్నది ఇండియా ప్రభుత్వం వొక్కటే. కనుక ప్రజాస్వామ్యవాదులు ఇండియా ప్రభుత్వం ద్వారా బ్రిటిషు ప్రజాస్వామికంతో సంబంధం యేర్పరచుకోవాలి. ప్రభుత్వంతో పోట్లాడుతూ వుంటే యీ సంబంధం యేర్పడదు. ప్రభుత్వంతో సంబంధం యేర్పరచుకుంటేనే బ్రిటిషుస్వామికంతో కూడ సంబంధం యేర్పరచుకోటాని వీలవుతుంది.

కనుక ఇటు జాతీయవాదుల్ని ప్రభుత్వం దగ్గరకు రానీయకుండా చేయటానికీ, అటు బ్రిటిషు ప్రజాస్వామికంతో సంబంధం యేర్పరచుకోటానికీ ఇప్పుడు ప్రభుత్వంతో సంబంధం పెట్టుకోటం అవసరం. ఇండియాలో జాతీయతత్వం నశించటానికి, ప్రజాస్వామిక ప్రభుత్వం యేర్పడటానికి యిదే మార్గం. ప్రజానీకానికి అనవసరంగా ప్రభుత్వం అంటే హేయభావం పుట్టించటం, ప్రభుత్వం నుంచి ప్రజల్ని దూరం చేయటం ప్రజాస్వామ్యవాదులు చేయవలసిన పనిగాదు. ఇది జాతీయవాదులు చేసే పని. ప్రజలకు ప్రభుత్వం అంటే ద్వేషాన్ని బుట్టించి, రెచ్చగొట్టి తద్వారా ప్రభుత్వాన్ని తమవశం చేసుకోవాలని ఇప్పుడు జాతీయవాదులు ప్రయత్నిస్తున్నారు. ప్రజాస్వామ్యవాదులు దీనికి ప్రతిక్రియ చేయాలి. జాతీయవాదుల కుతంత్రాల్ని, మోసప్రచారాన్ని ప్రజలకు చెప్పి యథార్థం బయటపెట్టాలి. స్వతంత్ర భారతరాజ్యాంగసూత్రాల్ని ప్రజల్లో ప్రచారంచేసి భావిప్రభుత్వం యెలా వుండాలో ప్రజలకు చెప్పాలి. ప్రజల్లో

వున్న అసంతృప్తికి కారణం వ్యాపారస్థులు చేస్తున్న కుతంత్రం (ఆహారపదార్థాలు దాచిపెట్టి ధరలు పెంచటం)అని వారికిచెప్పి సహకారసంఘాలద్వారా ప్రజలకష్టాలు తొలగించటానికి ప్రయత్నించాలి. ప్రభుత్వం ప్రస్తుతం కొంత మూకీభావం వహించినా ప్రజల్లో వున్న అసంతృప్తిని తగ్గించటానికి ప్రజాస్వామ్యవాదుల సహాయం తీసుకోకతప్పదు, కనుక యీవిధంగా ప్రజాస్వామ్యవాదులు ప్రభుత్వానికీ, ప్రజానీకానికీ మధ్య వుండి ఒకరితో వొకరికి సంబంధం యేర్పరచాలి.

ఈ విధంగా జరగటంవల్ల జాతీయవాదుల యెత్తులు సాగవు. ప్రజానీకం యథార్థం తెలుసుకుంటుంది. జాతీయవాదు లెవరో, ప్రజాస్వామ్యవాదు లెవరో తెలుసుకుంటుంది. యుద్ధానంతరం జరిగే ఎన్నికల్లో ప్రజలు తాము యెవరికీ వోటుచేయాలో తెలుసుకుంటారు. ఇప్పటి ప్రభుత్వం, ప్రభుత్వంద్వారా బ్రిటిషు ప్రజాస్వామికంతో సన్నిహితసంబంధం యేర్పరచుకోటంవల్ల బ్రిటిషు ప్రజాస్వామికంకూడ ఇండియాలోని నిజమైన ప్రజాస్వామ్యశక్తు లేవో తెలుసుకుని ఇండియాకిచ్చిన స్వయంనిర్ణయహక్కు వాటికి చెందేటట్లు ప్రయత్నిస్తుంది. ఇదే కాకుండా యీ సన్నిహిత సంబంధంవల్ల భావిభారత నిర్మాణానికి అనుభవంగల బ్రిటిషు ప్రజాస్వామిక సహాయంకూడా లభిస్తుంది.

కనుక ఇండియాలోని విప్లవం యీ విధంగా నెగ్గటానికి వీలుంది. ఇది విప్లవమంతా కాదనీ, అవకాశతత్వం అనీ కొంతమంది భావించవచ్చు. కాని వున్న పరిస్థితుల్ని అర్థంచేసుకుని వాటికి అనుకూలంగా నడవటం అవకాశతత్వం కాదు. రియు

లిజం అవుతుంది. ఫయలిజం లేకుండా విప్లవం నెగ్గదు. విప్లవం అంటే యుద్ధం అనీ, సాయుధతిరుగుబాటనీ, రక్తపాతం అనీ అనుకునేవాళ్ళకు యీ పంథా అర్థంకాకపోవచ్చు. విప్లవం వొక దేశంలో జరిగినట్లుగా మరో దేశంలో జరపాలనుకోటం తెలివితక్కువ. అసలు అలా జరగటం అసంభవం. పరిస్థితుల్ని బట్టి విప్లవాలు జరుగుతవి. ఈ యుద్ధంవల్ల కొత్త పరిస్థితులు యేర్పడ్డవి. కాబట్టి కొత్త రకం విప్లవాలు జరుగుతవి. ఇండియాలో జరగబోయే విప్లవంకూడా కొత్తరకానికి చెందినదే. ఈ యుద్ధంవల్ల పది విప్లవాలవల్ల జరిగే మార్పులు జరిగాయి. అంతులేని రక్తపాతం జరిగింది. విప్లవం అంటే యేంటో తెలుసుకున్నవాడికి యీ మార్పులూ, యిందుకు జరిగిన రక్తపాతం అర్థం అవుతుం. దిఅది అర్థంకానప్పుడు యిదీ, ఇది అర్థం కానప్పుడు అదీ అర్థంకావు.

జాతీయవాదులూ, జాతీయపెట్టుబడిదార్లూ, అమెరికా, ఇంగ్లండు పెట్టుబడిదార్లని కావులించుకుంటే, ఇండియా ప్రజా స్వామికం, బ్రిటిషు స్వామికంతోనూ, దానిద్వారా రష్యాతోను సంబంధం పెట్టుకోటం అవసరం. ఇలా చేయకపోతే దేశీయ పెట్టుబడిదార్లకూ, జాతీయవాదులకూ వున్నంత బలం, ప్రజా స్వామ్యవాదుల కుండదు. వారి యత్నాన్ని వీరు భగ్నం చేయలేరు.

## 10. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ

విప్లవం అనవసరంగా కనపడ్డా, అనుకున్నప్పుడల్లా విప్లవం చేయటం తేలిగ్గాదని చెప్పాము. విప్లవం చేయించటానికి విప్లవ

పార్టీ, విప్లవ నాయకత్వం తప్పనిసరిగా వుండాలని కూడా చెప్పాము. విప్లవపార్టీ, విప్లవనాయకత్వం వున్నప్పటి కూడా విప్లవం అనుకున్నంత త్వరలో జరగటం కష్టం. విప్లవశక్తుల, విప్లవ వ్యతిరేక శక్తుల బలాబలాల్ని బట్టి,విప్లవం జరుగుతుంది. విప్లవ వ్యతిరేకశక్తుల బలం యెక్కువగా వుంటే విప్లవపార్టీ, విప్లవనాయకత్వం వున్నా విప్లవం తేలిగ్గా జరగటం కష్టం. కాబట్టి విప్లవవాదుల కర్తవ్యం- (1) విప్లవపార్టీ, విప్లవనాయకత్వాన్ని స్థాపించటం (2) విప్లవశక్తుల్ని కూడగట్టటం (3) విప్లవ వ్యతిరేక శక్తుల్ని నాశనం చేయటం.

నేడు ఇండియాలో రాడికల్సు చేస్తున్నపని యిదే. ఇండియాలో విప్లవం చేయించటం రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ప్రథమ ఆశయం. కాని విప్లవం అంటే గిట్టనివర్గానికి యీపార్టీ అంటే గిట్టదు. ఇది సహజమే. కనుక విప్లవ వ్యతిరేకవర్గానికి చెందిన జాతీయవాదులూ, పెట్టుబడిదార్లూ, షావుకార్లూ, జమీందార్లూ మొదలైనవారంతా యీ పార్టీని వ్యతిరేకిస్తున్నారు. జాతీయ తత్వాన్ని బోధించే పత్రికలన్నీ రాడికల్సుని, రాడికల్‌పార్టీని దుమ్మెత్తి పోస్తున్నై. కాని యింతమాత్రంచేత రాడికల్సు వెనుకంజ వేయలేదు. ఎన్ని అవాంతరాలొచ్చినా, ఎన్నికష్టాల్ని ఎదుర్కోవలసి వచ్చినా తమ విధ్యుక్త ధర్మాన్ని విడవకుండా రాడికల్సు ముందుకు పోతున్నారు.విప్లవవాదులకీ బాధలు తప్పవు. వెనుకంజ వేయుటం విప్లవవాదుని లక్షణం కాదు.బ్రాహ్మణమతాన్ని యెదిరించి నందుకు బుద్ధుడు నాస్తికుడని, పాషండుడని పిలువబడ్డాడు. వున్నమతం పనికిరాదని కొత్త

మతం స్థాపించినందుకు ఏసుక్రీస్తుకు చిలువ కొయ్యమీద మరణ దండన జరిగింది. రష్యావిప్లవనాయకుడైన లెనిన్ విప్లవరోజుల్లో జర్మనీ సామ్రాజ్యవాదుల యేజంటుగా సందేహించబడ్డాడు. నేడు ఇండియాలోకూడ యిదేవిధంగా రాడికల్సుకి వ్యతిరేకంగా దుష్ప్రచారం జరుగుతుంది. ఇది జాతీయవాదులూ, జాతీయ పత్రికలు చేస్తున్న దుష్ప్రచారం. కాని నిర్ణయించేది చరిత్ర.

రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ స్థాపించి మూడు సంవత్స రాలు జరిగి యిది నాల్గో సంవత్సరం. కాని ఇండియా రాజకీయాల్లో ఇరవై సంవత్సరాలకు పైనుంచి రాడికల్సు స్వాతంత్ర్యోద్యమంలో కృషి చేస్తున్నారు. సోషలిజం, కమ్యూనిజం అంటే యేంటో యెరగనిరోజుల్లో ఇండియాకి సోషలిస్టుభావాల్ని, మార్క్సిస్టు తత్వాల్ని దిగుమతి చేసింది యమ్. యన్. రాయ్. బూర్జువా నాయకత్వం అంటే యేంటో, గాంధీతత్వానికీ, బూర్జువా నాయకత్వానికీ; గాంధీతత్వానికీ ఫాసిజానికీ వున్న సంబంధం యేంటో విశదీకరించింది యమ్. యన్. రాయ్. స్వాతంత్ర్యం అంటే యేంటో, స్వాతంత్ర్యం వస్తే ఇండియా యెలా వుండాలో నొక నిర్ణీత కార్యక్రమాన్నిచ్చింది యమ్. యన్. రాయ్. దేశంలో ఇరవై సంవత్సరాలకూ యిప్పటికీ తేడా కనబడుతుంది. ఒకప్రక్క ప్రజల్లో విప్లవచైతన్యం, స్వాతంత్ర్యభావాలు అభివృద్ధి చెందుతున్నై. మరోప్రక్క విప్లవవ్యతిరేకశక్తులు విజృంభిస్తున్నై.

విప్లవపార్టీని విప్లవనాయకత్వాన్ని స్థాపించటం విప్లవాదుల మొదటి కర్తవ్యం అని చెప్పాము. ఇందుకోసం యమ్. యన్.

రాయ్, రాడికల్సూ ఇరవై సంవత్సరాలనుంచీ తీవ్ర కృషి చేస్తూనే వచ్చారు. కాంగ్రెసుకు దేశంలో పలుకుబడి వుంది. కాని కాంగ్రెసులోని నాయకత్వం బూర్జువానాయకత్వం. యీ నాయకత్వాన్ని తొలగించి ప్రజావిప్లవనాయకత్వం స్థాపిస్తే కాంగ్రెసు విప్లవపార్టీ కావటానికి, కాంగ్రెసుద్వారా విప్లవం చేయటానికి వీలుండేది. కాంగ్రెసులో విప్లవనాయకత్వంస్థాపించ టానికి రాయ్ 1920 నుంచీ తాను ఐరోపాఖండంలో వుండికూడా ప్రయత్నించాడు.

1920 లో అహమ్మదాబాదు కాంగ్రెసు మహాసభకు రాయ్ పంపిన తీర్మానం "ఇండియాలో జరగవలసింది ప్రజా విప్లవం (1) స్వాతంత్ర్యం అంటే (ఎ) ప్రజాస్వామిక విప్లవం (బి) పారిశ్రామిక విప్లవం (సి) రైతు విప్లవం (2) ఇందు కోసం పోట్లాడే వర్గాలు—శ్రామికులు, రైతులు, పెట్టీబూర్జువా వర్గం. (3) ఇందుగ్గాను తీవ్రవాదులు వేయవలసిన కార్య క్రమం——కాంగ్రెసులో ప్రజావిప్లవనాయకత్వం స్థాపించటం, ప్రజల్లో విప్లవప్రచారం చేయటం." రాయ్ ఐరోపాఖండంలో వున్నప్పుడు కాంగ్రెసు మహాసభలో ప్రతిపాదించమని ఇచ్చట తీవ్రవాదులకు పంపిన తీర్మానం యిది.

1922 గయా కాంగ్రెసుకు రాయ్ మళ్లీ వొక తీర్మానం పంపాడు. ఇందులో 1921 సహాయనిరాకరణ వుద్యమం వోడిపోవటానికి కారణం కాంగ్రెసులోని బూర్జువా నాయ కత్వంమే నని, బూర్జువావర్గం యెప్పుడూ సామ్రాజ్య ప్రభు త్వంతో రాజీపడటానికి చూస్తుందని ప్రజావుద్యమాన్ని బల

పర్చదని కాబట్టి కాంగ్రెసులో బూర్జువానాయకత్వం తొలగించటానికి తీవ్రవాదులు కృషిచేయాలని హెచ్చరించాడు. 1923 ఢిల్లీ స్పెషల్ కాంగ్రెసుమహాసభకు గాంధి ప్రజాస్వామ్యవాది కాడని రుజువుచేయటానికి గాంధి నాయకత్వానికీ, ప్రజాస్వామిక విప్లవానికీ మధ్యనున్న పరస్పర విరుద్ధాన్ని చూపుతూ బహిరంగలేఖ వ్రాశాడు.

1928 అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ ఆరో సమావేశం—ప్రపంచంలో జాతీయతత్వం పేర విజృంభిస్తున్న ఫాసిస్టు ప్రమాదాన్ని ప్రజాస్వామిక శక్తులు ప్రతిఘటించాలని రాయ్ హెచ్చరించాడు.

1931 నుంచి 1936 వరకూ రాయ్ జైల్లోవున్నాడు. కాని విప్లవతత్వాన్ని జీర్ణించుకున్న రాడికల్సు కొంతమంది కాంగ్రెసులోనే పనిజేస్తూ ప్రజావిప్లవ కోసం కాంగ్రెసుని ప్రజాపార్టీగా మార్చటానికి కృషిచేసారు. రాయ్ జైల్లో వుండికూడా కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి ఆపార్టీ పేరుతో కొంతమంది జాతీయవాదులు, కమ్యూనిస్టులు కాంగ్రెసులో చేస్తున్న అవకతవకల్ని ఖండిస్తూ ప్రజావిప్లవానికి కాంగ్రెసుని యేవిధంగా ప్రజాపార్టీగా మార్చాలో చూపిస్తూ కొన్ని వుత్తరాలు వ్రాసాడు. 1937 లో జైల్లోనుండి బయటకురాగానే రాయ్ చెప్పింది— "మనకు కావలసింది సోషలిజమూ కాదు కమ్యూనిజమూ కాదు. మనం చేయవలసిన విప్లవం ప్రజావిప్లవం. ఇందుగ్గాను కాంగ్రెసుని ప్రజాపార్టీగా మార్చాలి. కాంగ్రెసులో విప్లవనాయకత్వం స్థాపించాలి."

1939 నవంబరువరకూ రాడికల్సు కాంగ్రెసులోనేవున్నారు. దాదాపు ఇరవై సంవత్సరాలు కాంగ్రెసులోనే వుండి కాంగ్రెసులో విప్లవనాయకత్వం స్థాపించి కాంగ్రెసును ప్రజాపార్టీగా మార్చటానికి ప్రయత్నించారు. తీవ్రవాదులంటూ పైకిచెప్పుకున్నా సంకుచిత జాతీయతత్వంలో పెరిగి కాంగ్రెసు సోషలిస్టులకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు శాఖవారిమని గప్పాలు కొట్టుకున్నా విప్లవతత్వం, మార్క్సిస్టు దృక్పథం లేని దేశీయ కమ్యూనిస్టులకూ, రాడికల్సు, రాయ్ చెప్పింది నచ్చలేదు. సంయుక్త సంఘటన అనే ఫాసిస్టు నినాదంతో, బూర్జువా నాయకత్వంతో చేతులు కలిపారు. ఈ అవసరా చూసుకుని బూర్జువావర్గం కాంగ్రెసులోని విప్లవ తత్వాన్ని, నాశనం చేసింది. కాంగ్రెసులోని క్రింది సంఘాలకు యేమీ హక్కులు లేకుండా వర్కింగుకమిటీకే సర్వాధికారాలు అప్పగించింది. గాంధీని కాంగ్రెసు నియంతగా చేసి కాంగ్రెసులో వున్న ప్రజాస్వామికాన్ని కూడా నాశనం చేసింది.

ఇట్టి పరిస్థితుల్లో రాడికల్సు కాంగ్రెసులో వున్నా ప్రయోజనం లేదు. కాంగ్రెసుని విప్లవపార్టీగా మార్చటానికి రాడికల్సు ప్రయత్నించారు. కాని కాంగ్రెసే తలక్రిందైనప్పుడు దాన్ని బాగుచేస్తూ కూర్చుంటే కాలం జరగటం తప్ప మరో ప్రయోజనం లేదు. కాగా యీ యుద్ధాలవల్ల కాంగ్రెసుతత్వానికీ, రాడికల్సుకీ అసలే పొత్తుకుదరలేదు. ప్రజాస్వామికం కావాలనే రాడికల్సుని కాంగ్రెసు బయటకు వెళ్ళగొట్టింది. వెళ్ళగొట్టినా అందులోనే వుంటామని కమ్యూనిష్టుల్లాగా బిరా

యిస్తే విప్లవం మనకోసం ఆగదు. విప్లవంకోసం విప్లవపార్టీ వుండాలి. కనుక రాడికల్సు రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించారు. కాబట్టి యీపార్టీ పార్టీగా స్థాపించబడి రెండు మూడు సంవత్సరాలైనా రాడికల్సు నిన్న, మొన్నటి వారని కానీ, యీపార్టీ యింకా బాల్యదశలోనే వుందని కానీ అనుకోటం పొరపాటు. ఇరవై సంవత్సరాల కృషిఫలితం యిది.

ఇక్కడ ఇండియన్ కమ్యూనిష్టు పార్టీని గూర్చి రెండు మాటలు చెప్పటం అవసరం. కమ్యూనిస్టుపార్టీ విప్లవపార్టీ యెందుకు కాదో, రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ యెలా అవుతుందో చెప్పటం ముఖ్యం. కమ్యూనిస్టులూ విప్లవం కావాలంటున్నారు. రాడికల్సూ కావాలంటున్నారు. అయితే తేడా యేమిటని అడగవచ్చు. తేడా చాలావుంది. విప్లవం కావాలన్నంతమాత్రంచేత విప్లవపార్టీ అనిపించుకోదు. "జాడ్యం నయం కావాలి, కావాలి" అంటే నయం కాదు. సరైన మందువేస్తే రోగం పోతుంది. అలాకాకుండ యేదోవొకమందు వేస్తుంటే రోగం యెక్కువౌతుంది. కమ్యూనిస్టుపార్టీ యీ స్థితిలోవుంది. విప్లవం కావాలన్నా విప్లవంచేయించే పద్ధతి తెలియదు. కాంగ్రెసు యేమంటుందో యీ పార్టీ అదే అంటుంది. జాతీయ ఐక్యత, జాతీయ ప్రభుత్వం, జాతీయ సంఘటన మొదలైనవి కమ్యూనిస్టుపార్టీ నినాదాలు. ఇవి విప్లవనినాదాలైతే కమ్యూనిస్టుపార్టీ విప్లవపార్టీ అవుతుంది. ఆ లెక్కలో కాంగ్రెసూ విప్లవపార్టే. కాంగ్రెసు కాకపోతే కమ్యూనిస్టుపార్టీ కూడ అంతే. ఒకదానికి తోకగా వున్నంతకాలం అది యెలా

నడిస్తే యిదికూడ అలాగే పోతుంది. 1933 లో జర్మనీలో హిట్లరు అధికారానికి రావటానికి అప్పటి కమ్యూనిస్టుపార్టీ యిదే పంథాలో నడిచి జాతీయ ఐక్యత పేరుతో హిట్లరుకు తోడ్పడింది. నేడు యిండియాలో కమ్యూనిస్టుపార్టీకూడ జాతీయఐక్యత అనీ, జాతీయ ప్రభుత్వం అనీ కాంగ్రెసుకి అధికారం అంటకట్టబో తుంది. ఇలా కాకుండా రష్యాలోని కెరెన్స్కీ ప్రభుత్వాన్ని తొలగించినట్లుగా ఇండియాలో కాంగ్రెసు అధికారానికి వచ్చినా వెంటనే తొలగించవచ్చునని కమ్యూనిస్టుపార్టీ ప్లాన్ వేసుకుని వుండవచ్చు. కాని కాంగ్రెసు అధికారానికి వస్తే కమ్యూనిస్టుల ఆటలు సాగవు. దేశీయపెట్టుబడిదార్లు అంత గుడ్డిగా లేరు. హిట్లరు అధికారానికి రాగానే జర్మనీలో కమ్యూనిస్టుల్ని నాశనం చేసినట్లు యిండియాలోకూడ జరుగుతుంది. విప్లవమూ వుండదు, గిప్లవమూ వుండదు.

ఈపరిస్థితులిలావుంచి ఇండియన్ కమ్యూనిస్టుపార్టీకి అంతర్జాతీయ దృక్పథం బొత్తిగా లేదు. ఎంతసేపున్నా బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీనిబట్టో,మరో కమ్యూనిస్టుపార్టీని బట్టో నడవటం అలవాటైపోయింది. అవి తంధానఅంటే తంధాన అంటం; కాదంటే కాదంటం. నిన్న మొన్నటిదాకా యీయుద్ధాన్ని సామ్రాజ్య వాద యుద్ధం అనీ వ్యతిరేకించింది. (ఫ్రాన్సు కమ్యూనిస్టుపార్టీ యిదే తప్పుచేయటంవల్ల అప్పటి పెట్టుబడిదార్లకు ఫాసిస్టు ప్రభుత్వం స్థాపించటానికి కొంత వీలుచిక్కింది.) తరువాత రెండురంగాల్లో రెండురకాల యుద్ధం అని ప్రచారం చేసింది. ఇప్పుడు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం అంటుంది. పోనీ యిప్పటి

కైనా మార్చుకున్నా తత్వంలో భేదంలేదు. ఎంతసేపున్నా జాతీయ సంస్థ, జాతీయ సంఘటనం, గాంధీకంటె మరో ఫాసిస్టు వ్యతిరేకవాది (విప్లవవాది) నెహ్రూపండితుని మించి మరో పోషకులిస్టు లేదంటుంది. పరిస్థితుల్ని లా అర్థంచేసుకొన్న కమ్యూనిస్టుల్ని జాతీయ కమ్యూనిస్టులనో, గాంధియన్ కమ్యూనిస్టులనో చెప్పటం మంచిది. కనుక కమ్యూనిస్టుపార్టీని విప్లవపార్టీగానూ, నాయకత్వాన్ని విప్లవనాయకత్వంగానూ లెక్కించటానికి వీల్లేదు.

విప్లవపార్టీ చేయవలసింది విప్లవశక్తుల్ని కూడగట్టటం, విప్లవ వ్యతిరేకశక్తుల్ని నాశనం చేయటం. విప్లవశక్తులేవో, వ్యతిరేక శక్తులేవో తెలుసుకోలేని కమ్యూనిస్టుపార్టీ దీన్ని సాధిస్తుందనుకోటం భ్రమ. ఇండియాలో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ ఒక్కటే యిందుకు పూనుకుంది. ఈ పార్టీ దృష్టిలో జాతీయతత్వాన్ని బోధించే వర్గాలన్నీ విప్లవానికి వ్యతిరేకం. వీటిని యెదిరించటం విప్లవవాదుల లక్ష్యం. కాగా జాతీయవాదుల చేతుల్లోకిగానీ, పెట్టుబడిదారీవర్గానికిగానీ, ప్రభుత్వాధికారం పోకుండా, ప్రజలకే సంక్రమించేటట్లు చేయటం యీ పార్టీ ఆదర్శం. ఇందుకోసం యీపార్టీ తీవ్రకృషి చేస్తూవుంది.

ఇండియాలో ప్రజావిప్లవం, ప్రజాస్వామిక ప్రభుత్వం కోసం ప్రయత్నించేది యీ పార్టీ వొక్కటే కాబట్టి ప్రజాస్వామిక శక్తుల తరఫున యీ పార్టీ ప్రాతినిధ్యం వహిస్తుంది. శ్రామికుల ప్రత్యేక ప్రాతినిధ్యం కోసం అఖిలభారత కార్మిక ఫెడరేషన్ స్థాపించి ఇంతవరకు ఆరులక్షలకుపైగా పారిశ్రామిక కూలీల్ని

యిందులో చేర్చగలిగింది. అంతర్జాతీయ దృక్పథంతో, జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల్ని బట్టి ఇండియాలో విప్లవం జయప్రదం కావటానికి యీపార్టీ వొక నూతన కార్యక్రమాన్నిచ్చింది. సహకారసంఘాలద్వారా ప్రజారక్షణ సంఘాలద్వారా, విప్లవ శక్తుల్ని కూడగట్టటం, స్వతంత్రఇండియా రాజ్యాంగసూత్రాల్ని ప్రచారంచేస్తూ జాతీయ వాదుల, పెట్టుబడిదారుల వ్యతిరేక భావాన్ని, సంకుచితతత్వాన్ని ప్రజల కెరిగించటం, ప్రభుత్వంతో సన్నిహిత సంబంధాన్ని కల్పించుకుని ప్రభుత్వాన్ని జాతీయ శక్తులనుంచి వేరుచేయటం యీపార్టీ కార్యక్రమం. ప్రజల్ని రెచ్చగొట్టి ప్రభుత్వంమీద తిరుగుబాటు చేయడం యీ పార్టీ కార్యక్రమంకాదు. ఇది జాతీయ కమ్యూనిస్టులు చేసేవని. ఇలాచేస్తే పరిస్థితు లేవిధంగా పరిణమిస్తాయో వెనుక చర్చించాము.

ఈ కార్యక్రమంవల్ల విప్లవం యెలా నెగ్గుతుందో చూద్దాం. సహకారసంఘాలద్వారా, చౌకడిపోలద్వారా లాభాలకోసం అమ్మే మధ్యబేరగాణ్ని తొలగించటానికి, ప్రజల కష్టాలు నివారించటానికి వీలుంటుంది. వ్యాపారస్థుల్ని లాభాలు పొందకుండా చేయటం ప్రజాస్వామ్యశక్తులకు బలం చేకూర్చటం. కాగా ప్రజలకు తమ కష్టాలునివారించే పార్టీ అంటే అభిమానం యేర్పడుతుంది. దీనివల్ల పార్టీ బలపడుతుంది. జాతీయవాదులు, పెట్టుబడిదార్లు జాతీయప్రభుత్వం కావాలంటున్నారు. రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ప్రజాప్రభుత్వం కావాలంటుంది. ఇందుకోసం ప్రజారక్షణ సంఘాలు స్థాపించి, స్వతంత్రయిండియా

రాజ్యాంగసూత్రాల్ని ప్రజల్లో ప్రచారం చేస్తావుంది. జాతీయ ప్రభుత్వానికీ, ప్రజా ప్రభుత్వానికీ వున్న తేడా, అది వస్తే కలిగేనష్టాలూ, యిదివస్తే కలిగే లాభాలూ చూపిస్తావుంది. దీనివల్ల జాతీయవాదుల మోసం బయటపడుతుంది. ప్రజానీకం యథార్థం తెలుసుకుని ప్రజాప్రభుత్వాన్ని బలపర్చే పరిస్థితుల్లో వుంటుంది. ప్రజానీకాన్ని యీ స్థితిలోకి తేగలిగితే దేశంలో విప్లవవ్యతిరేకులైన జాతీయవాదులకు ఓటమి సంభవించినట్లే.

అయితే ప్రభుత్వంతో సంబంధం యెందుకని కొంతమంది ప్రశ్నించవచ్చు. ప్రభుత్వం వొక సాధనంగా వుంది. యెవరి చేతుల్లో వుంటే వారికి వుపయోగపడుతుంది. జాతీయవాదులు చేపట్టితే వారు యిష్టంవచ్చినట్లు వుపయోగిస్తారు. ప్రజాస్వామ్య శక్తుల్ని యీ సాధనంద్వారా నాశనం చేయటానికి వీలవుతుంది. కాబట్టి ప్రజలే యీ సాధనాన్ని చేపట్టాలి. ప్రజా ప్రాతినిధ్యంవహించే రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ, ప్రభుత్వంతో సంబంధాన్ని కల్పించుకోవాలంటం యిందుకోసమే. సంబంధలేకుండా ప్రభుత్వాన్ని బలవంతంగా వశంచేసుకోవాలంటే ప్రభుత్వం జాతీయవాదుల చేతుల్లోకి పోటానికి సిద్ధపడుతుంది. అట్టి పరిస్థితుల్లో ఇండియాలో ప్రజాస్వామ్య శక్తులకు అసలే ఆస్కారంవుండదు.

ఇది యిలావుంచి ప్రభుత్వంతో సంబంధం కల్పించుకోవటం చేత మరోకార్యంకూడా ఫలించటానికి వీలుంది. ప్రభుత్వం, ప్రభుత్వంద్వారా బ్రిటిషు ప్రజాస్వామిక ప్రభుత్వంతో (ఈ విషయాన్ని వెనుక కొంత చర్చించాము) సంబంధం కల్పించుకోటా

నికి పిలుంది. దేశీయ పెట్టుబడిదార్లూ, జాతీయవాదులూ అమెరికా, ఇంగ్లండు పెట్టుబడివార్ల సహాయంతో జాతీయప్రభుత్వం స్థాపించటానికి ప్రయత్నిస్తుంటే, ఇండియాలోని ప్రజాస్వామ్యవాదులు దీన్ని భగ్నం చేయటానికి ఇండియా ప్రభుత్వాన్నీ, బ్రిటిషు (ప్రజాస్వామిక) ప్రభుత్వంతోనూ చేతులు కలపటం అవసరం. ఇలా చేయకపోతే ప్రమాదం వుంది. జాతీయవాదుల బలం యెక్కువౌతుంది. కేవలం ఇండియాలోని ప్రజాస్వామ్యవాదులు వీరిని ప్రతిఘటించే స్థితిలో వుండరు. జాతీయవాదులు అమెరికా సహాయం కోరితే, ప్రజాస్వామ్యవాదులు ఇంగ్లండు, ఇంగ్లండుద్వారా రష్యాసహాయం కోరటం తప్పులేదు. కాగా యిది అవసరం కూడాను. కమ్యూనిస్టుభాయిలకిది నచ్చదు. అసలు జాతీయ తత్వాన్ని కాపులించుకునే కమ్యూనిస్టులకిది నచ్చకపోటంకూడా సహజమే.

## తేలినవిషయాలు

యుద్ధంవల్ల పరిస్థితులన్నీ తలక్రిందులైనై. పాతచుట్టరికాలు పోయి కొత్తచుట్టరికాలు యేర్పడ్డయి. ఫాసిస్టుశక్తులు జాతీయ తత్వంపేరిట విజృంభిస్తున్నై. పరిస్థితులు అర్థంచేసుకోకపోతే ఇండియాలో ప్రమాదం తప్పదు. జాతీయశక్తులొకవంకా, ప్రజాస్వామ్యశక్తులొకవంకా ప్రభుత్వానికి రెండుప్రక్కలా వున్నవి. ప్రభుత్వాన్ని యెవరు ముందు చేరగలిగితే వారిదే విజయం. జాతీయ శక్తులే ముందు వస్తే యిండియాలోని భావి ప్రభుత్వం ఫాసిస్టు ప్రభుత్వం అవుతుంది. ప్రజాస్వామ్యశక్తులు

ముందు వెళ్ళగలిగితే ప్రజారాజ్యం యేర్పడుతుంది. జాతీయ శక్తుల ప్రాతినిధ్యం వహించే పార్టీలు — కాంగ్రెసు, కాంగ్రెసు తత్వాన్ని బలపరిచే యితరపార్టీలు, ప్రజాస్వామ్యశక్తుల ప్రాతినిధ్యం వహించే పార్టీలు — రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ, అఖిల భారత కార్మిక ఫెడరేషన్. కాంగ్రెసు వుద్యమం, గాంధీ నిరసనవ్రతం వోడిపోయినా బయటనున్న కాంగ్రెసు నాయకులూ — కాంగ్రెసంటే అభిమానం వున్నవారూ, తిరిగి ప్రభుత్వానికీ, కాంగ్రెసుకూ రాజీచేయటానికి తతంగం చేస్తున్నారు. ఇదిగనక నెగ్గితే పరిస్థితులు మరీ అధ్వానం అవుతై. కనుక ప్రజానీకం, ప్రజాస్వామ్యవాదులు దీన్ని గుర్తించి యీ ప్రమాదం రాకుండా ఇండియాలో విప్లవం జరిగేటట్లు ప్రయత్నించాలి. రాడికల్ డెమోక్రాటిక్ పార్టి యిచ్చిన కార్యక్రమమే యిందుకు సులువైన మార్గం.

---

# అనుబంధం

జాతీయ వాదికి యీపుస్తకంలోని విషయాలు చాలా కటువుగా కనపడవచ్చు. కాని నిష్పాక్షిక బుద్ధికి యదార్థ పరిస్థితులు గోచరించకమానవు. కనీసం పాఠకుడు యీపుస్తకం చదివిన తరువాత వొక్కసారి తిరిగి యదార్థ రాజకీయ పరిస్థితుల్ని సింహావలోకనం చేసుకోటానికి ప్రయత్నించితే కొంత వరకు యీపుస్తక ఆశయం నెరవేరినట్లే. సంకుచిత దృష్టితో ఏదో వొక విషయాన్ని మూఢంగా నమ్మి దాని ప్రతిబింబం కోసం పుస్తకాలుచదివేవారికి ఈపుస్తకం వుపకరించక పోవచ్చు. కాని యింతమాత్రంచేత నా పుస్తక ఆశయం నెరవేరలేదని నేను భావించను.

యుద్ధం అంతిమ దశకు వచ్చింది. ఫాసిస్టు రాజ్యాలు వోడిపోతయ్యనే దృఢనమ్మకం యేర్పడింది. దీంతోపాటు మన దేశీయ రాజకీయ వాతావరణంలోకూడ మార్పు కనబడు తుంది. యీ మార్పు తప్పనిసరికూడాను. ఇంతవరకు యుద్ధ సహాయానికి ససేమిరా అన్న కాంగ్రెసుదృక్పధం మార్చుకుంది. పైకిమట్టుకి మేకపోతుగాంభీర్యం కనపరుస్తుంది. జాతీయ ప్రభుత్వంపేరుతో పోయిన పలుకుబడిని సంపాదించుకోటానికి, అధికారం చేపట్టటానికి జాతీయవాదులు కాంగ్రెసుపేరుతో ప్రయత్నిస్తున్నారు.

దేశీయ పెట్టుబడిదారుల సంగతి ఆలోచిద్దామాఅంటే వారు కూడా అధికారం కోసం నూతన యత్నాలు జరుపుతు

న్నారు. ప్రస్తుత ప్రభుత్వం వున్నంతకాలం, బ్రిటిషు ప్రభు
త్వంతో సంబంధం పెట్టుకున్నంతవరకూ వారికి అనుకున్నట్లు
లాభాలు వచ్చేటట్లు కనబడలేదు. జాతీయ ప్రభుత్వం అంటే
ఫాసిస్టు ప్రభుత్వమే పెట్టుబడిదార్లకు శరణ్యం. దానిద్వారానే
వారు దోపిడీ విధానాన్ని సాగించటానికి వీలుంది. అందుకని
వొక ఫాసిస్టు ఆర్థిక ప్రణాలికను తయారుచేసి అది ఆచరణలో
పెట్టటానికి జాతీయ ప్రభుత్వం కావాలని, ఆప్రభుత్వం యేమి
చేసినా ప్రజలు అంగీకరించాలనీ, యెదుకు తిరగ్గూడదని ప్రచా
రం చేస్తున్నారు.

ఇక కమ్యూనిస్టుల సంగతి సరేసరి. పక్కా జాతీయ
కమ్యూనిస్టులుగా, గాంధియన్ కమ్యూనిస్టులుగా ప్రవర్తిస్తు
న్నారు. కాంగ్రెసుకంటె మరోశరణ్యం లేదంటున్నారు. గాంధి
గారికంటె మరోనాయకుడు లేడంటున్నారు. పెట్టుబడిదారుల
ఫాసిస్టు ఆర్థిక ప్రణాలికను బలపరుస్తున్నారు. ఆప్రణాలికకు
కావలసిన ప్రచారంకూడ చేసిపెట్టుతున్నారు. వారి దృష్టిలో
దేశంలో యింతకంటె మంచిప్రణాలిక లేదుకూడాను.

వీటికి తగ్గట్టుగా జాతీయపత్రికలు "జాతీయప్రభుత్వం",
"జాతీయప్రభుత్వం" అని గగ్గోలుపెట్టుతున్నై. అజ్ఞానంలో,
దాస్యభావంలో వున్న ప్రజానీకం తనకు యేదికావాలో, యేది
వద్దో తెలుసుకోలేని స్థితిలోవుంది. యీ ఆసరా కనిపెట్టి
కాంగ్రెసునాయకులు తమ పార్టీ అంగనిర్మాణాన్ని పూర్తిగా
మార్చివేస్తున్నారు. నేటి కాంగ్రెసునిర్మాణం "ఒక దేశంలో
ఒకటేపార్టీ, ఒకటే నాయకుడు, ఒకటే సిద్ధాంతం వుండాలి"

అనే ధోరణిలో జరుగుతుంది. జర్మనీలో నాజీపార్టీ యిదే పంథాలో నిర్మించబడ్డది. నేడు యిండియాలో కాంగ్రెసు యిదే పంథా చేపట్టింది. జర్మనీలోని నాజీపార్టీ అధికారఫలితం మనం చూస్తున్నాము. మన దేశంలో యిదే పంథాలో నడిచే పార్టీ అధికారానికివస్తే ఫలితం వేరేవిధంగా వుంటుందనుకోటం దుర్భ్రమ. ఇండియా స్వతంత్ర దేశం అనిపించుకుంటుంది. కాని సాంఘిక, రాజకీయ, ఆర్థిక, నైతికదాస్యాలు తప్పవు. ప్రజానీకం అజ్ఞానంతో, దారిద్ర్యంతో బాధపడక తప్పదు.

## ప్రత్యామ్నాయం

అయితే మరి దీనికి ప్రత్యామ్నాయం ఏమిటి? దేశం యిలాంటి ప్రమాదస్థితిలోపడటానికి అవకాశాలున్నవని రాడికల్ డెమొక్రాటిక్‌పార్టీ ఆదిలోనే గ్రహించింది. ఈ ప్రమాదం రాకుండా చేయటానికి ప్రత్యామ్నాయ కార్యక్రమాన్నిచ్చింది. ఆ కార్యక్రమాన్ని ఆచరణలోపెట్టటానికి తీవ్రకృషిచేస్తూవుంది.

పెట్టుబడిదారుల ఫాసిస్టుప్రణాలికకు మారుగా ప్రజాప్రణాలికను, భావి స్వతంత్ర భారతరాజ్యాంగ విధానాన్ని తయారుచేసి ప్రజానీకం ముందుపెట్టింది. కార్మిక ఫెడరేషన్‌ద్వారా శ్రామిక వర్గంలో ప్రచారం జరుగుతుంది. ఇంగ్లండులోకూడ మన దేశ యధార్థపరిస్థితులు, రాడికల్ డెమొక్రాటిక్‌పార్టీ ఆశయాలు తెలియచెప్పటానికి తీవ్రప్రచారం జరుగుతుంది. ఇంగ్లండు—ఇండియా శ్రామికవర్గం కలిసి పనిచేయటానికి యత్నాలు జరుగుతున్నవి.

బ్రిటిషుప్రభుత్వం వొక్కసారిగా యుద్ధం పూర్తికాగానే యిక్కడ తన అధికారాన్ని పూర్తిగా వదలుకొని యేదోవొక పార్టీకో, లేక కొన్నిపార్టీలకో ఇండియాని అప్పగించివెళ్ళదు. యుద్ధానంతరం జరిగే అసెంబ్లీయెన్నికల్లో నిలబడి గెలిచే పార్టీల బలాబలాలు,వాటి సిద్ధాంతాల్ని బట్టి, ప్రస్తుతప్రభుత్వం ఆపార్టీలతో పెట్టుకునే సంబంధాల్ని బట్టి, భావిభారత దేశ పరిస్థితులు ఆధారపడివుంటై. పెట్టుబడిదారులు తమ ప్రణాలికతోనూ, కాంగ్రెసు, కాంగ్రెసుతో సంబంధంపెట్టుకొన్న యితరపార్టీలు తమ జాతీయవాద ప్రచారంతోనూ పోటీచేస్తవి. రాడికల్ పార్టీ తన "ప్రజాప్రణాలిక, స్వతంత్ర భారతదేశరాజ్యాంగవిధానం" వీటిరెంటినీ ఆదర్శంగా తీసుకొని పోటీచేస్తుంది. అంతవరకూ వీటిని ప్రజల్లో తీవ్రప్రచారం చేస్తుంది.

## చివరిమాట

భారతదేశ ప్రజానీక భావిజీవిత నిర్ణయం జరగవలసిన కాలం సమీపిస్తుంది. ఇది ప్రజానీకం పూర్తిగా మున్గటమో, తేలటమో తేల్చే నిర్ణయం. ఇందులో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ గెల్చిందంటే ప్రజాశక్తులు గెల్చినట్లే. దేశంలో ప్రజా ప్రభుత్వం యేర్పడటానికి, ప్రజాప్రణాలిక ఆచరణలో పెట్టటానికి అవకాశాలు యేర్పడతై. లేకపోతే ఫాసిస్టుప్రభుత్వం, ఫాసిస్టు ఆర్థికప్రణాలిక,ప్రజాదారిద్ర్యం తప్పవు.

పరరాజ్యం కంటె యెలాంటిదైనా 'మన రాజ్యం' మంచి దనే ప్రచారం మన దేశంలో విరివిగా జరుగుతుంది. ఇది నమ్మే జనం కూడా మనలో ఎక్కువగానే వుంది. ఈ తత్వం వున్నంత కాలం ప్రజానీకానికి ముక్తి అనేది వుంటం అసంభవం. పాలక వర్గం కంటె పరిపాలనా విధానంలో మనం జాగ్రత వహించాలి. రష్యా విప్లవం మొదటి రోజుల్లో రష్యన్ జాతికి సంబంధించని కొన్ని రాష్ట్రాల్లో విప్లవ వ్యతిరేకులు "మనకు రష్యన్ల ప్రభుత్వం అక్కర్లేదు. మన ప్రభుత్వాన్ని మనమే స్థాపించు కుందామనే" నినాదంతో అంతర్యుద్ధం లేవదీసారు. వీరి ప్రయత్నం గనక నెగ్గినట్లైతే నేడు రష్యా యీ విధంగా వుం డేది కాదు. కనుక మనం కోరవలసింది "మన రాజ్యం" అంటే తెల్ల ప్రభుత్వం పోయి నల్ల ప్రభుత్వం రావటం కాదు. "మన రాజ్యం" అంటే ప్రజారాజ్యం, ప్రజాశ్రేయస్సును కూర్చే ప్రభుత్వం. ఈ విషయాన్ని ప్రజలు గుర్తించు కోవాలి. శత్రువు లెవరో, మిత్రులెవరో తేలిగ్గా తెలుసుకోవచ్చు. పరజాతి అంతా శత్రువర్గానికి చెందిందని, మన జాతి అంతా మిత్ర వర్గానికి చెందిందని అనుకుంటే ప్రమాదం తప్పదు.